# ఎప్పటికీ మీకేమీ కాను

వి. రతన్‌ప్రసాద్



# ఎప్పటికీ మీకేమీ కాను

వి. రతన్‌ప్రసాద్





నవల :

ఎప్పటికి మీకేమీకాను!

రచన :

ఎ. రతన్‌ప్రసాద్

ముఖచిత్రం :

బాపు

ఆగష్టు 1977



సచిత్ర మాసపత్రిక

విజయవాడ - 520 002



# ఎప్పటికీ మీకేమీ కాను

శీతాకాలపు ఉదయం........

చీకటి తెరలు అప్పుడప్పుడే విడిపోతూ - విచ్చుకుంటున్న
వెలుగు రేఖలకు స్వాగతం పలుకుతున్నాయి..

దూరంగా వున్న వెంకటేశ్వరస్వామి దేవాలయం గోడపై
అమర్చిన 'స్పీకరు' లోంచి శ్రీనివాసూ జానకీ పాడుతున్న శ్రీశై
సుప్రభాతం అలలు అలలుగా, ఊరంతా వ్యాపిస్తోంది.

పెరటి నూతి గట్టుకు ఆనుకొని పళ్ళు తోముకుంటున్న
చంద్రశేఖరం - ఎదురుగా, కరివేపాకు చెట్టుమీద కూర్చున్న కా
పు పరిశీలనగా చూస్తున్నాడు.... ఏ చీకూ చింతా లేనట్టుగా
పీగా కూర్చుని ప్రక్కనున్న బాదం చెట్టువైపు చూస్తోంది అది..

వ్యతిసుత్యాలు

ఉండి ఉండి వీస్తున్న చంచల వాయువులకు, ఆ బా
చెట్టుకున్న పచ్చని చిక్కని గుబురుటాకులు ఊగులాడుతూ శే
ఎంతని తునాతునకలు చేసి సీతలను వ్యాపింపచేస్తున్నాయి ...

ఆ బాదం చెట్టువైపూ - దాని ఆకులమీద నుండి జారి డ
తున్న మంచు బిందువులవైపూ చూస్తున్న శేఖరానికి - ఆ ప్రక్కనే ముద్దమందారాన్ని అందుకోలేక సతమతమవుతున్న హరిత కని పించింది....

అప్పుడే స్నానం చేసింది కాబోలు - ఆరీ ఆరని కురులను వెనక్కి తీసుకొని - మొదట్లో నీలంరంగు రిబ్బనుతో ముడి వేసు కుంది.... ఆకాశం రంగు పరికిణీమీద అదేరంగు బ్లౌజు వేసుకుంది. వాటిమీద నారింజరంగు ఓణీ మరీ బాగుంది....

ఎర్రని మందారం కోసంపైకి చాచిన ఆమె పచ్చని చేతుల క్రిందనుంచి, బిగుతైన ఆమె యవ్వనం మీదకుపోయి నిలిచి పోయాయి శేఖరం చూపులు....

హరితలో దాగివున్న ఆ అద్భుత సౌందర్యం చంద్రశేఖరం లోని తీపికోరికలకు అంకురార్పణ చేసింది. ఎందుకో, ఆమెను చూస్తూంటే, ప్రతిరోజూ తాను చూసే హరిత కాదన్నట్లు అనిపించ సాగింది. మందార మొక్కకు చిటారు రెమ్మన విరిసిన ముద్ద మందారాన్నీ - దానిని అందుకోవటానికి ఆదుర్దాగా ప్రయత్నిస్తున్న హరితనూ మార్చిమార్చి చూశాడు.

ఆ వెంటనే తన ఆలోచనలకు స్వస్తిచెప్పి - టవల్‌తో ముఖం తుడుచుకుంటూ - పువ్వును కోసిద్దామని హరితవద్దకు వచ్చే సరికి - అప్పటికే తెంపిన మందారపువ్వును పూలసజ్జలో వేసు కుంది హరిత.

"హరితా!"

"ఏమిటి శేఖరం?"

"పూలు కోసివ్వనా?"

"వద్దు! చాలా పువ్వులున్నాయిగా! నాన్నగారి పూజ ఇవి చాలు" - అప్పటికే నందివర్ధనం, పారిజాతాలతో నిండిపోం పూలసజ్జవైపు చూస్తూ అంది.

ఇంట్లోకి వెళ్ళిపోతూన్న హారితను చూస్తూ అలాగే నిలబడి పోయాడు శేఖరం.

"మనసులో చిత్రించుకున్న మధురమూర్తి హృదయ కవాటాల మాటునే ఉండిపోదు"-తన మనసుకు నచ్చచెప్పుకున్నాడు....

తుషారానికి చెమ్మగిల్లిన బొగడచెట్ల ఆకుల సందుల్లోంచి పైకి చూశాడు....ఆకాశంలోని అరుణదీప్తి మెలమెల్లగా ధవళ కాంతికి తిరగటం కనిపించింది!

రామ్మూర్తిగారు కమ్మనికంఠంతో పాడుకుంటున్న భగవద్గీత శ్లోకాలు పూజగదిలోంచి మృదుమధురంగా వినిపిస్తూంటే-లోపలకు నడిచాడు శేఖరం.

రామ్మూర్తిగారుంటున్న మండువా ఇల్లు ఆయన తాత ముత్తాతలనాటిది. ఇల్లు పూర్వకాలంనాటిదే అయినా, చాలా విశాలంగా వుంటుంది. నిజానికి అంత పెద్దయిల్లు ఆయనకు అవసరం లేకపోయినా, ఆ పల్లెటూళ్ళో ఇల్లు అద్దెకు తీసుకోవాల్సిన అవసరమూ మరెవరికీ లేకపోయింది....

ఆ యింటిలోపలి మండువా చుట్టూ ఆరు గదులున్నాయి.... చంద్రశేఖరం ప్రత్యేకంగా ఓ గదిలో వుంటున్నాడు. దానికి ఎదురుగా వున్నగది రామ్మూర్తిగారి పూజగది.

ఇదివరకైతే, రామ్మూర్తిగారు శనివారాల్లోనూ, పర్వదినాల్లోనూ స్నానంచేసి పూజకు కూర్చునేవారు.... కానీ ఇప్పుడు 'రిటైర్' అయ్యింతర్వాత, ప్రతిరోజూ, ఆయన దినచర్యలో అదీ ఒక భాగమైపోయింది....

ముఖంకడుక్కుని తనగదిలోకి వచ్చిన శేఖరం, రామ్మూర్తిగారి పూజ ఎప్పుడు పూర్తవుతుందా అని ఎదురు చూస్తున్నాడు-పూజ పూర్తయితేనేకానీ ఆ యింట్లో ఎవరికీ కాఫీ అందదు.

"బాబూ! శేఖరం!"- పూజగదిలోంచి రామ్మూ పిలుపు వినిపించింది. తువ్వాలు భుజంమీద కప్పుకుంటూ శేఖరం.... అప్పటికే ఆయన వెలిగించిన హారతిని క కున్నాడు.

పూజగదిలోంచి ఇవతలకువస్తున్నవారిద్దరికీ, కా వస్తున్న హారిత కనిపించింది....

స్వాతిముత్యాలు

ఇద్దరూ కాఫీలు తీసుకున్నారు.

"గోపాలం నీకుగాని ఉత్తరం రాశాడా శేఖరం ?" మండువా లోకివచ్చి, అక్కడవాల్చివున్న పడకకుర్చీలో కూర్చుంటూఅడిగాడు రామ్మూర్తిగారు.

"లేదండీ! బహుశా ఇవాళో, రేపో, అతనేవచ్చేస్తాడేమో"- పక్కనేవున్న స్టూలుమీద కూర్చుని, వంటగదిలోకి వెళ్ళిపోతున్న హరితవైపు చూస్తూ అన్నాడు శేఖరం....

రామ్మూర్తిగారు కాఫీత్రాగటం ముగించిన కొన్నినిముషాలకే ఆచార్యులగారబ్బాయి శ్రీకంఠం. మునసబుగారిమేనల్లుడు పరశురాం వచ్చి, అక్కడే తుంగచాప పరచుకొని కూర్చున్నారు....వాళ్ళిద్దరూ ఆ ఊరి హైస్కూల్లో తొమ్మిదో తరగతి చదువుతున్నారు.

ప్రతిరోజూ పొద్దున్నే — ఓ గంటసేపు వాళ్ళకు ట్యూషన్ చెబుతూంటారు రామ్మూర్తిగారు. ఆ ఊరిహైస్కూల్లో ఆయన లెఖ్ఖలమాస్టారుగా పనిచేసేటప్పుడు ప్రతిరోజూ పదిహేనుమందిపిల్లలయినా ట్యూషన్ చెప్పించుకునేందుకు వచ్చేవారు.... కానీ ఆయన 'రిటైర్' అయింతర్వాత అందులో చాలామంది మానేశారు....

వచ్చిన పిల్లలిద్దరూ పుస్తకాలు తెరవటంతో, తన గదిలోకి వెళ్ళిపోయాడు శేఖరం....మడతమంచంమీద కూర్చుని, వెనకాల వున్న గోడకు జారగిలబడ్డాడు. క్షణంసేపు కళ్ళుమూసుకుని, ఏదో ఆలోచనలో పడేసరికి హరిత పిలుపు వినిపించింది.

"సాయంత్రం సంతనుంచి వచ్చేటప్పుడు నాకు వారపత్రిక తేవటం మర్చిపోకు సుమా"- అంటూ వెళ్ళిపోయింది హరిత.... ప్రతి శనివారం అలా గుర్తుచేయటం ఆమెకు అలవాటు....

హరిత వెళ్ళినవైపే చూస్తున్న శేఖరానికి_గతంలో జరిగిన ఘటన _ జ్ఞాపకానికి వచ్చింది....

[illegible]రిగ్గా అలాంటిరోజే _ ఒకరోజు - తనగదిలోకి వచ్చింది

[illegible]ఖరం !"

[illegible]'ఏటి' అన్నట్లు ఆమెవైపు చూశాడు....

[illegible]కే సంతకెళ్ళినప్పుడు నాకు వారపత్రిక తెచ్చిపెట్టాలి"...

[illegible]డబ్బు]లన్ని శేఖరం చేతిలో పెడుతూ అంది హరిత.

6 ఎప్పటికీ మీకేమీకాను !

"చిత్తం!"

"అన్నట్టుకథలపోటీకినువ్వు కథలేమీరాయలేదా?"-అడిగింది.

"పోటీకథలకు రాసేటంత పెద్దవాడినైపోలేదు హరితా!"

"అయితే పెద్దవాళ్ళే పోటీకథలు రాయాలన్నమాట!" ధారణ చేసుకుంటున్నట్టుగా అంది.

"కానీ........" ఏదోచెప్పబోయి ఆగిపోయాడు శేఖరం....

"చెప్పు శేఖరం! ఆగిపోయావేం?"-

"ఎందుకో నిన్నుచూస్తూంటే ఒక కథ రాయాలనిపిస్తోంది!"

"ఊఁ! అయితే త్వరగా రాయకూడదూ?....కథకు బహు ...ే వచ్చిందంటే నీకెంతపేరు వస్తుందో తెలుసా?"- అమాయ ...గా అడిగింది.

"నిజమే! మనిషి సుఖంగా బ్రతకటానికి పేరొక్కటి ...స్తే చాలదు.... ముందు జీవితంలో స్థిరపడాలి! ఆ తర్వాత ...నైనా కథలు రాసుకోవచ్చు"-

దానికీ దీనికీ సంబంధం ఏముంటుంది? దేనిదారి దానిదే! ...యినా నీకేమిటి?....వచ్చేఏడు 'ఎంబీ బియ్యేస్' చదువుతావుగా,"-

"అలా అని ఎవరన్నారు?"-

"ఎవరో అనాలా?.... మా స్నేహితురాలు సుజాతా వాళ్ళ ...న్నయ్య 'బియ్యేస్సీ' పాసయి, విశాఖపట్నంవెళ్ళి 'ఎంబీబియ్యేస్'లో ...రిపోయాడుగా! అలాగే నువ్వూనూ!.... అన్నట్టు, నువ్వు ...శాఖపట్నం వెళ్ళిన తరువాత ఎప్పుడైనా, నేనూ వస్తాను.... ...ప్పుడు నాకు సముద్రం చూపిస్తావా?"—

"తప్పకుండా!"

"సముద్రం అందంగా వుంటుందిట కదూ?" - అక్కడ ...న్న కుర్చీలో కూర్చుంటూ అడిగింది హరిత.

"అందంగానే వుంటుంది!.... కానీ నీ అంతకాదు" - ఆమె ...ళ్ళల్లోకి చూస్తూ అన్నాడు శేఖరం....

శేఖరం వైపు నిశితంగాచూసి, ఛివాల్నలేచి గదిలోంచి ...ళ్ళబోతూ - ఓ అడుగు వెనక్కివేసి—

"అన్నట్లు ఈ వేళ నా పుట్టినరోజు" - అంది హరిత.

"అలాగా!.... మరి చెప్పలేదేం?"—

• "చెబితే బంగారుగాజులు చేయించేవాడివా ? లేకపోతే ప పరికిణీ కుట్టించేవాడివా ?" - హరిత ప్రశ్నల్లో వ్యంగ్యధోర కానీ, ఎగతాళికానీ ధ్వనించలేదు.... ఆమె ఎంతచిలిపిగా అడిగిం అంత చిలిపిగానూ సమాధానం చెప్పాడు.

"పచ్చని నీ అరిచేతిలో ముద్దుపెట్టుకునేవాడ్ని !" అని..

"ఛీ !".... రివ్వున అక్కడ్నించి వెళ్ళిపోయింది హరిత..

ఆరోజునుంచీ ఎందుకో ఆమె గంభీరంగా మారిపోయింది.. ఎంతో అవసరం వుంటేనేకానీ తనతో మాట్లాడటంలేదు.... ఆ పిల్లలు ఎంతలో మారిపోతారూ ?....

ఆలోచిస్తున్నకొద్దీ హరిత రూపమే తన కళ్ళనిండా నిం పోతోంది.... ఆలోచనలను బలవంతాన త్రెంచుకుని - స్నానా తయారయ్యాడు శేఖరం....

* * * *

నాగరికత ఛాయల్ని ఇప్పుడిప్పుడే సంతరించుకుంటున్న అందమైన పల్లెటూరు శీతానగరం....

అక్కడి పిల్లలు చదువుకునేందుకు ఆ ఊళ్ళో ఓ హైస్కూలువుంది. పెద్దవాళ్ళకోసం ఓ లైబ్రరీకూడావుంది !.... ఊరికి ఒకవైపు వెంకటేశ్వరస్వామి దేవాలయం, మరోవైపు శిష లయం వున్నాయి....

ఊరి మొదట్లో పంచాయతీ సమితివారు వేసిన తారురోడ్డుంది. ఆ రోడ్డు మీదనుంచి వెళ్ళే 'ఆర్టీసీ' బస్సులు అప్పుడొకటీ అప్పుడొకటీ శీతానగరంలో ఆగుతాయి.... ఆ వూరికి మూడుమైళ్ళ దూరంలోవున్న టౌన్లోనే, శేఖరం 'బియ్యేస్సీ' చదివాడు.... ఆ టౌనులోనే, ప్రతి శనివారం సంతకూడా జరుగుతుంది.

ఆరోజు సంతనుంచి శేఖరం తిరిగి వచ్చేసరికి పొద్దు పూర్తిగా వాలిపోయింది. హరితవచ్చి, శేఖరం తెచ్చిన పత్రిక తీసుకుని వెళ్ళిపోయింది. వర్ధనమ్మగారు కూరలసంచీని అందుకుని శేఖరానికి గ్లాసుతో మంచినీళ్ళు అందించారు.

పెరట్లో జాజిపందిరిక్రింద మంచంమీదకూర్చున్న రామ్మూర్తి గారు శేఖరాన్ని పిలిచారు.... శేఖరంవచ్చి ఆయనకు ఎదురుగా వున్న అరుగుమీద కూర్చున్నాడు. ఆయన తన విషయమే ఏదో

డగబోతున్నారేమో అనిపించింది శేఖరానికి.... గుండె క్షణం య తప్పింది....

'ఒకవేళ హారితను పెళ్ళిచేసుకొమ్మని అడుగుతారేమో?....'

'అంత అదృష్టమా?'.... ప్రతి విషయం హారితచుట్టూ తిరుగుతూండబట్టి, అన్నీ అలాగే అనిపిస్తున్నాయి కాబోలు.... అయినా హారిత ఎక్కడ, తానెక్కడ?....తనో దిక్కులేని అనాధ!... రామ్మూర్తిగారి దయవల్ల, తాను అంతటివాడయ్యాడు' నిట్టూర్చాడు శేఖరం.

"శేఖరం!"

ఉలిక్కిపడి రామ్మూర్తిగారి వైపు చూశాడు....

"బాబూ! శేఖరం! నువ్ ప్యాసయ్యావ్.... అంతేచాలు! గోపాలం పరీక్ష ప్యాసవుతాడని ఎలాగూ అనుకోలేదులే! వాడు మేనమామగారింటి దగ్గర్నుంచి రానూలేదు। కనీసం ఉత్తరం కూడా రాయలేదు. పోన్లే....ఇంతకీ నువ్ ఏంచేద్దామనుకుటున్నావ్?-

తల ఒంచుకున్నాడు శేఖరం.

"ఇంకా చదవాలనిఉంటే చెప్పు బాబూ!"-

ఆయన ఆప్యాయతకు శేఖరం కళ్ళు చెమర్చాయి.

"వద్దండీ! ఇంతవరకూ చదివిందే ఎక్కువ! ఎక్కడైనా ఉద్యోగంకోసం ప్రయత్నాలు చేస్తాను"-

రామ్మూర్తిగారు హారితవిషయం ఎత్తకపోవటం శేఖరానికి కాస్త నిరాశ కలిగించింది.... 'అయినా తన కాళ్ళమీద తాను నిలబడేవరకూ ఆ సంగతి ప్రస్తావించక పోవటమే మంచిది అని మనసుకు నచ్చచెప్పుకున్నాడు శేఖరం.

తర్వాత రామ్మూర్తిగారు చాలాసేపు శేఖరంతోమాట్లాడారు... హైదరాబాదులో, శ్రీమంతుడైన శ్రీనివాసరావు తన చిన్ననాటి స్నేహితుడనీ, అతని వద్దకు వెడితే తప్పక సహాయం చేస్తాడనీ, ఉత్తరం రాసిస్తాననీ చెప్పారు రామ్మూర్తిగారు.

ఆ రాత్రంతా శేఖరానికినిద్రపట్టలేదు. ఆ ఇంటినీ- ఆ వూరినీ విడిచిపోవాలంటే అంతులేని బాధ కలుగుతోంది....కానితప్పదు.... తాను రెక్కలొచ్చిన పక్షి!.... భవిష్యత్తును వెతుక్కుంటూ - ఆ వెచ్చని గూడువదిలి ఎగిరిపోవాల్సిందే!!

* * *

చీకట్లను చీల్చుకుంటూ రైలు వేగంగా వెడుతోంది. అం
మించిన వేగంతో శేఖరం ఆలోచనలు వెనక్కి పరుగెడు తున్నా

అంతకుముందు, తాను స్టేషన్‌కు బయల్దేరుతూంటే రామ్మూ
గారు ఆశీర్వదించారు. అప్పుడు ఆయన కళ్ళల్లో నీటిపొర కదిలిం
మీరు కూడా "స్టేషన్‌కు వెళ్ళరాకూడదూ?" అని అడిగిం
వర్ధనమ్మ....

"వాడ్ని బండిఎక్కించి పంపేసి - నేనొక్కడ్నీ ఒంటరి
రాలేను"- అన్నారు రామ్మూర్తిగారు.... ఆయన అలా అన్నప
తనకెందుకో గుండె ఝల్లుమంది....

"బాబూ! క్షేమంగావెళ్ళి లాభంగా తిరిగిరా నాయనా!
మంచితనమే నీకు శ్రీరామరక్ష!"-అని వర్ధనమ్మగారు అంటూం
గానే ఆమె గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. కన్నతల్లి
మరిపించే ఆమెకళ్ళు శ్రావణమేఘాల్లా వర్షించాయి. కన్నప్రేమ
కంటే పెంచిన ప్రేమలో-ఏదో అద్భుతమైన శక్తివుండివుండాలి...
కన్నది దేవకి అయినా, శ్రీ కృష్ణునికోసం - యశోద ఎన్నిసార్ల
కంటతడి పెట్టుకోలేదూ?.... అటువంటి మహనీయుల ఆదరా
మానాలు పొందగలిగిన తాను ఎంతో అదృష్టవంతుడు....

హరిత జ్ఞాపకాలు స్నిగ్ధసుగంధ వీచికలు - అక్కడ్నించి
బయల్దేరినపుడు ఆమె విశాలనేత్రాల్లో నీలినీడలు కదిలి - ఏదో
భావన క్షణంసేపు తటిల్లతలా మెదిలి మాయమయింది.... కానీ
అదేమిటో శేఖరానికి అర్ధం కాలేదు.

రైలు ఏదోస్టేషనులో కాసేపు ఆగి - మళ్ళీ బయల్దేరింది.
ఆ కాసేపూ ఎంతో సందడి! రైలువెళ్ళిపోగానే అంతాశూన్యం!!

రైలు వేగాన్ని మరింతపుంజుకుంది.... శేఖరం కిటికీలోంచి
బయటకు చూస్తూ కూర్చున్నాడు. మబ్బుతునకలలోంచి మిణుకు
మిణుకు మంటున్నాయి నక్షత్రాలు.... వాటిని చూస్తూంటే, హరిత
చిన్నప్పుడు,"సప్తఋషులు ఎక్కడవున్నారో చూపించవా శేఖరం"
అని అడగటం గుర్తుకొచ్చింది.

ఎంతో చనువుగావుండే హరితలో ఈమధ్య ఏదో మార్పు
కనిపిస్తోంది....అది ఏమిటో అర్థంకావటంలేదు....మనసంతా బరు



ఎప్పటికీ మీకేమీకాను!

నెక్కినట్లవుతోంది.... అతని ఆలోచనలు శీతానగరం చుట్టూ పరి భ్రమిస్తూనే వున్నాయి....

డాబామీదనుంచి చూస్తే - గ్రామానికి ఆనుకున్న ఒంకర బాట ... ఆ బాటప్రక్కగా పచ్చనిపూలు పూసిన అవ పొలాలూ.... పెరటిగోడపై వట్టిన పల్చని నాచూ.... కిటికీలోంచి ప్రభాతసమయాన్ని చూసినప్పుడు - దూరాన రంగురంగుల ఆకాశం పటంపైన అవ్యక్త మనోవాంఛల్లా తేలిపోయే తెల్లని తెరచాపలవంటి మబ్బులు, ప్రథమ యవ్వనపు ఊహామరీచికల్లా అతన్ని వెంటాడుతూంటే హృదయం శూన్యావస్థలోకి జారిపోయింది....

శీతానగరం, రామ్మూర్తిగారిల్లూ, ముద్దమందారాలూ, హరిత చూపులూ, అన్నీ అతని అశ్రువుల్లో అలుక్కుపోయి- అస్పష్టమై- క్రమక్రమంగా కరగిపోతోంటే, నిద్రలోకి ఒరిగిపోయాడు శేఖరం....

# 2

తెల్లతెలవారుతూండగా నాంపల్లి స్టేషనులోదిగాడు శేఖరం.... వెయిటింగ్‌రూమ్‌లోనే స్నానంచేసి, రెస్టారెంట్ లో కాఫీఫలహారాలు ముగించుకుని - స్టేషనులోంచి బయటకు వచ్చాడు....

చీకటిని వెనక్కినెట్టి - ఒళ్ళు విరుచుకుంటూ ఆవలించి - ఒక్కసారిగా చైతన్యవంతమైంది భాగ్యనగరం....

ఎక్కడి శీతానగరం?.... ఎక్కడి భాగ్యనగరం?....

"హలో శేఖరం!"....

ఆలోచిస్తూ నిలబడిన శేఖరం చటుక్కున వెనక్కితిరిగి ఆశ్చర్యపోయాడు.... నవ్వుతూ కనిపించాడు నరేష్.... అతన్ని చూసేసరికి ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది శేఖరానికి.... కుడి చేతిలోని బ్రీఫ్‌కేసును ఎడంచేతిలోకి మార్చుకుని, నరేష్ చెయ్యి గట్టిగా పట్టుకుని -

"హమ్మయ్య.... ఈ మహానగరంలో భగవంతుడిలా దర్శనం యిచ్చావోయ్"- అన్నాడు.

"ముందు స్కూటరెక్కు! ఇంటికి వెడదాం,"

వెనకాల సీటుమీద కూర్చున్నాడు శేఖరం.... బ్రీఫ్‌కేసుని, తన కాళ్ళదగ్గర పెట్టుకుని స్కూటర్ స్టార్ట్ చేశాడు నరేష్....

నరేష్‌దికూడా శీతానగరమే....ఎప్పుడూ అత్తెసరు మార్కులతో పాసయ్యేవాడు.... శేఖరంతో లెఖ్ఖలు చెప్పించుకుంటూండేవాడు.... ప్రస్తుతం సెక్రటేరియట్‌లో 'లా' సెక్షన్‌లో పనిచేస్తున్నాడు....

ఇంటికి రాగానే తాళంతీసి—

"ఇదేభాయ్ మన బ్రహ్మచారుల మఠం!.... ఇకనుంచీ నువ్వూ నాతోనే వుంటావు కాబట్టి దీన్ని బ్రహ్మచారుల మఠం అంటున్నాను"— అన్నాడు నరేష్ నవ్వుతూ.

ఇల్లు బాగానేవుంది.... మూడుగదుల పోర్షన్.... వరుసగా వున్నాయి గదులు.... ముందుగదిలో సోఫాకంబెడ్, రెండుకుర్చీలూ బొమ్మలున్న చిన్నషోకేసు, ఓ టీపాయ్, వున్నాయి.... గోడకు చార్‌మినార్ సిగరెట్ కంపెనీవారి కాలెండరూ, హేమమాలిని నవ్వుతున్న మరోకాలెండరూ తగిలించివున్నాయి.... రెండవగదిలో తెల్లని బెడ్‌షీట్ పరచిన మంచం, బట్టలస్టాండూ, దానిమీద మేసెడు విడిచిన బట్టలూవున్నాయి.... మూడవగది న్యాయానికి వంటగది.... కానీ 'బాత్‌రూం' పెరటిలో దూరంగా వుండటం వల్ల దాన్నే 'బాత్‌రూం'గా వాడుకుంటున్నాడు నరేష్.... పక్కింట్లో ఎవరో మహారాష్ట్రులు వున్నారట!....

శేఖరం బట్టలు మార్చుకునేలోగా, నరేష్ బయటకు వెళ్ళి ఓ కుర్రాడ్ని పిలిచి, ఫ్లాస్కు ఇచ్చిపంపించాడు కాఫీ తీసుకరమ్మని.

ఇద్దరూ తాపీగా కూర్చున్నాక - సిగరెట్‌కేసు బయటకుతీసి, ఓ సిగరెట్టు శేఖరానికి ఆఫర్ చేశాడు నరేష్....

"నో.... థాంక్స్" - అన్నాడు....

నరేష్ తన సిగరెట్టువెలిగించుకుని - పొగతోపాటు సన్నగా నవ్వి - "అవును! నువ్వింకా ఇప్పుడేగా శీతానగరంనుంచి బయట పడింది.... కానీయ్‌లే! తొందరేముందీ?" - అన్నాడు.

"హైదరాబాదేకాదు.... అమెరికావెళ్ళినా నా శీతానగరపు అలవాట్లు మారేవికావు! రామ్మూర్తిగారి అడుగుజాడలో నడిచిన

నేను వారి ఆదర్శాలను ఎప్పటికైనా అందుకోగలనా అనేదే నా తపన!" - అని అందామనుకున్నాడు శేఖరం.... కానీ మౌనంగా నవ్వేసి వూరుకున్నాడు.

"అదిసరేకానీ - ఓ కార్డుముక్కరాసి పడేస్తే స్టేషన్‌కు వచ్చేవాడినిగా" - మళ్ళీ అన్నాడు నరేష్.....

"నిజమే! రాయవలసింది!.... నువ్వు కనిపించావు కాబట్టి మనసు కొంచెం స్థిమితపడింది"—

"ఇంతకీ తమరాకకు కారణంబెద్ది?...."

చిన్నప్పటి నాటకాల ధోరణి ఇంకా మరచిపోనందుకు నరేష్‌కేసి నవ్వుతూచూసి....

"ఏముందీ? ఉద్యోగాన్వేషణ!.... రామ్మూర్తి మేష్టారి స్నేహితులు శ్రీనివాసరావుగారు బంజారాహిల్స్‌లో వుంటున్నారట.... ఆయనను కలుసుకోవాలి .... అసలు బండి దిగగానే, సరాసరి వారింటికే వెళ్ళమని మేష్టారు మరీ మరీ చెప్పారు .... పరాయిచోట ఉండాలంటే నాకెంత మొహమాటమో నీకుతెలుసుగా! దైవంలా నువ్వుకనిపించి నా సమస్యను ఇట్టే పరిష్కరించావు.... నిజంగా నీకు ఎంతో ఋణపడి వుంటాను నరేష్!...."

"అదేంమాట శేఖర్! నువ్వు నాకు పరాయివాడివా?.... ఒక్కమంచం ఒక్కకంచం కాదుకానీ. మనం చిన్ననాటిస్నేహితులం.... ఆరోజులు ఎప్పటికీరావు.... ఇక్కడ నువ్వు హాయిగా వుండు.... ఎన్నాళ్ళున్నా నాకేం అభ్యంతరం లేదు.... తెలిసిందా? .... మన పెళ్ళిళ్ళయి విడిపోతేచెప్పలేనుకానీ, అంతవరకూ మదీయగృహంబు మనిద్దరిదిన్...."

నరేష్ మాటలకు శేఖరం తృప్తిగా ఆనందంగా నవ్వుకున్నాడు.

"తొందరగా బయల్దేరు.... ముందు అన్నపూర్ణాలో భోజనం కానిచ్చి,ఆ తర్వాత నిన్ను శ్రీనివాసరావుగారింటివగ్గర దిగబెడతాను! అసలు ఈరోజు నేనుకూడా స్టేషన్‌కి యాక్సిడెంటల్‌గా రావలసి వచ్చింది.... మా ఆఫీసులో పనిచేస్తున్న ఒకాయనచుట్టం ఈరైల్లో వస్తున్నాడనీ, మా కాలనీనుంచి స్టేషన్‌కి పొద్దున్నే వెళ్ళాలంటే కన్వేయన్సు కష్టమనీ, నా సహాయం అడిగాడు.... 'పోన్లే పాపం' అని నా స్కూటర్‌మీద ఆయనను తీసుకొచ్చి స్టేషన్లో దిగబెట్టి -

అక్కడున్న కాఫీహోటల్లో బ్రేక్‌ఫాస్ట్‌కానిచ్చి అలా వచ్చేసరికి తమరి దర్శనంలభించింది.... అదీకథ.... ఊఁ.... త్వరగాబయల్దేరు. నాకు మళ్ళీ ఆఫీసుకు టైమయిపోతుంది" — తొందర పెట్టాడు నరేష్....

హోటల్ అన్నపూర్ణలో గాజుతలుపు నెట్టగానే చల్లనిగాలి మొహానికి తగిలింది.... క్షణం కళ్ళు కనిపించనంత చీకటి.... క్రమంగా పల్చని వెలుతురు మెత్తగా కళ్ళకు అలవాటయింది. బేరర్ రాగానే రెండు 'స్పెషల్‌మీల్స్' ఆర్డరిచ్చాడునరేష్.... శేఖరం ఏదో మాట్లాడుతున్నాడేకానీ- అతని ఆలోచనలు ఎక్కడెక్కడో పరిభ్రమిస్తున్నాయి....

నరేష్ చిన్ననాటి విషయాలు ఎన్నో జ్ఞాపకం చేస్తున్నాడు.

భోజనం ముగించి ఇద్దరూ బయటకు వచ్చారు.

స్కూటర్ బంజారాహిల్స్ వైపువెడుతూంటే, శేఖరానికి భాగ్యనగరపు సౌందర్యాన్ని వర్ణించి చెబుతున్నాడునరేష్ శ్రీనివాస రావుగారి అడ్రసువున్న కవరు మరోమారు చూసుకుని, ఆ యింటి గేటువద్ద ఆపాడు స్కూటర్ని....

గేటుకు ఒకపక్కన నల్లచలువరాతి పలకమీద 'ఆదిత్య నిలయం' అన్న తెల్లని అక్షరాలు మెరుస్తున్నాయి....

అక్కడపనిపూర్తయిన తరువాత, తిరిగి ఇంటికి ఏబస్సులో, ఎలా వెళ్ళాలో వివరంగా చెప్పి, డూప్లికేటు తాళంచెవి అతనికిచ్చి వెళ్ళిపోయాడు నరేష్....

గేటు తోయగానే కిర్రుమని చప్పుడైంది....లోపలదూరంగా మహాఠీవిగా కనిపించింది అందమైన బంగళా.... గేటునుంచి 'పోర్టికో'వరకూ బాటవుంది. బాటకు రెండువైపులా అందమైన క్రోటన్సు మొక్కలు కత్తిరించబడిఉన్నాయి....నెమ్మదిగా బంగళా వైపునడుస్తూ చుట్టూ చూశాడు.... పచ్చని లాన్.... బంగళా బంతి పూవులు.... ఫౌంటెన్...అక్కడక్కడ రంగురంగులుగా విరబూసిన బోగన్‌విల్లా చెట్లు.... ఆకాశాన్నంటే సర్వీచెట్లు....వాటిని పెన వేసుకపోయిన బఠాణీ తీగలూ....ఆ తీగలనిండా పూసిన ఎర్రని పగడాల్లాంటి పువ్వులూ.... నేత్రానందంగావుంది, ఎంతచూసినా

తనివితీరలేదు శేఖరానికి....వచ్చినపని గుర్తుకువచ్చి, చూపుల్ని మరల్చుకుని - ముందుకు నడిచాడు....

పోర్టికోలోకివచ్చి నుంచున్నాడు....ఎదురుగా మెట్లున్నాయి.. మెట్ల దిగువ, రెండువైపులా పాలరాతి సింహాలున్నాయి.... రెండు మూడు మెట్లు ఎక్కాడోలేదో అల్సేషియన్ కుక్క భయంకరంగా అరుస్తూ శేఖరంమీదకు ఉరకబోయింది. అంతలో మెరుపులా నీరజ శేఖరానికీ - కుక్కకూ మధ్యగావచ్చి - "ఏయ్ చిన్నా....ఆగు". అంది గట్టిగా....

అంతలోనే రాజయ్య పరుగెత్తుకుంటూ వచ్చి - "నయం తల్లీ - మీరు రావటం ఆలస్యం అయిందంటే ఈ అబ్బాయిగార్ని కరిచేసేదే! లేచినవేళ బాగుంది!"- అంటూ చిన్నా మెడకువున్న తోలుబెల్టు పట్టుకుని, లాక్కువెళ్ళాడు రాజయ్య....చిన్నా వెడుతూ కూడా శేఖరంవైపు చూస్తూ గుర్రుమని అంటూనేవుంది....

శేఖరం గుండె అప్పటికి కుదుటబడింది....

"సారీ! రండి! నాన్నగారికోసం వచ్చారనుకుంటాను". అంది ఆమె....

"ఔనండీ! శీతానగరం నుంచి వచ్చాను!.... శ్రీనివాస రావుగార్ని కలుసుకోవాలి"—

శేఖరాన్ని తనతో లోపలకు తీసుకవెళ్ళింది నీరజ....

లోపల పెద్దహాలు అది.... శేఖరానికి సోఫా చూపించి లోపలకు వెళ్ళిపోయింది. హాలంతా ఓసారి పరీక్షగా చూశాడు శేఖరం. ఎక్కడ చూసినా, ఏదిచూసినా, దాని విలువను అంచనా కట్టలేనంతగా అనిపిస్తోంది.... అంత ఖరీదైన హాలును, జీవితంలో ఎన్నడూ చూడని శేఖరానికి ఎంతో ఆశ్చర్యం కలిగింది.

అంతలోనే ఎదురుగావున్న కర్టెన్ క్రిందనుంచి, నల్లని స్లిప్పర్స్‌లోని తెల్లని పాదాలు కదులుతూ అతని దగ్గరకు వచ్చి ఆగిపోయాయి.... అప్పుడు నీరజను సరిగాచూశాడు.... "పాలరాతి ప్రతిమ ప్రాణంపోసుకుని నడిచి వచ్చిందా" అన్న భ్రాంతి కలిగింది శేఖరానికి....

"నాన్నగారు మిమ్మల్ని పైకి తీసుకరమ్మన్నారు....రండి"..

నీరజవెంట శేఖరం నడిచాడు....

"మీరు చంద్రశేఖరంగారు కదూ !.... రామ్మూర్తి అంకుల్ దగ్గర్నుంచి టెలిగ్రాంవచ్చింది మీరు వస్తున్నట్లు" - అంది నీరజ ముందర నడుస్తూ.

స్వపరిచయం తప్పినందుకు మనసులోనే రామూర్తిగారికి ధన్యవాదాలు తెలుపుకున్నాడు శేఖరం....

శ్రీనివాసరావుగారిని చేరుకోవటానికి అయిదారు గదులు దాటి మేడమీదకు వెళ్ళాలి....

మేడమీదకు చేరుకోగానే గది చూపించి - 'మీరు లోపలకు పదండి, నేను ఇప్పుడే వస్తాను' అంటూ మళ్ళీక్రిందకు పోయింది నీరజ....

శ్రీనివాసరావుగారి గదిలో అడుగుపెట్టిన శేఖరం నిర్ఘాంత పోయాడు....

డెకలామ్‌తో చేసిన పెద్దమంచం.... దానిమీద పాలనురుగు లాంటి తెల్లని దుప్పటీ.... దానిమీద అరుద్ర పురుగురంగులో ముఖమల్ దిండ్లూ.... గోడలకు పెద్దపెద్ద ఆయిల్ పెయింటింగ్ సీనరీలూ.... అందులో ఒక ఆయిల్ పెయింటింగ్‌లో వేసిన నగ్నస్త్రీ చిత్రం సజీవంగా కనిపిస్తోంది.... ఆమె, తన రెండు చేతులతో వక్షోభాగాన్ని 'క్రాస్'గా కప్పుకుని - తలకొద్దిగా పక్కకువాల్చి సిగ్గును అభినయిస్తోంది.... మంచానికి వెనుకగా - శ్రీనివాసరావు గారిదే ఫొటోలు నిలువెత్తు తైలవర్ణచిత్రం గంభీరంగా నిలబడి నట్లుంది. ఆయన కప్పుకున్న కాశ్మీర్ శాలువపై చేసిన ఎంబ్రాయి డరీ పనితనం కొట్టవచ్చినట్లుంది....

కిటికీలకు అందమైన 'నైలాన్ నిట్టెడ్' కర్టెన్లు వేళ్ళాడుతూ గాలికి వయ్యారంగా కదులుతున్నాయి.... గోడల మూలల్లో చందనపు కర్రతో చేసిన స్టాండులూ, వాటిపైన పూలదాన్‌లూ.... వాటిలో అప్పుడప్పుడే విచ్చుకుంటున్న రంగురంగుల గులాబీ పువ్వులూ పైనుంచి వ్రేలాడుతున్న బెల్జియమ్ షాండిలియర్సూ,మరో మూల దంతంతోచేసిన పెద్దడ్రస్సింగ్ టేబిలూ.... దానిమీద విదేశీ పెర్ఫ్యూమ్సూ.... స్ప్రేబాటిల్సూ....నేలంతా మెత్తగాపరచుకున్న కాశ్మీర్ తివాసీ.... ఓ విధమైనతీయని పరిమళం.... శేఖరాన్ని క్షణంపాటు ఏవోలోకాల్లోకి తీసుకపోయాయి.

శ్రీనివాసరావుగారు శ్రీమంతులని తెలుసుగానీ, అంత భాగ్యవంతులని తనకు తెలియదు....

"కూర్చోబాబూ!"

అదిరిపడి చుట్టూ చూశాడు శేఖరం.... అంతవరకూ తాను ఆ ప్రక్కకు చూడనేలేదు. శ్రీనివాసరావుగారు సింగిల్ సోఫాలో కూర్చుని తననే పరిశీలనగా చూస్తూండటం చూసి ఎంతో సిగ్గు పడ్డాడు శేఖరం.

ఆయన చాలా హుందాగావున్నారు కళ్ళజోడులోంచి చూసే ఆయనచూపుల్లో కొంత తీక్షణతకూడా లేకపోలేదు. ఆయన నిల బడితే భారీమనిషని తోచింది శేఖరానికి

"రామ్మూర్తి ఎలా వున్నాడు?"- అ ప్రశ్నవేసిన తీరూ, ఆయనకళ్ళలో వెలిగిన ఆప్యాయతా చూస్తూంటే, రామ్మూర్తిగారి యందు ఆయనకు వున్న స్నేహమధురిమ వెల్లడయింది..

"బాగున్నారండీ! మీకు ఈ ఉత్తరం ఇమ్మన్నారు"- జేబు లోంచి ఉత్తరాన్ని బయటకుతీసి భద్రంగా, వినయంగా ఆయన చేతిలోపెట్టాడు శేఖరం.

"నువ్ ముందుకూర్చో"- ఉత్తరాన్ని అందుకుంటూ మళ్ళీ అన్నారు ఆయన.... పక్కనేవున్న మరో సోఫాలో ఒడిగిపోయి కూర్చున్నాడు శేఖరం.

ఆయన ఉత్తరాన్ని పూర్తిగా చదివి దీర్ఘంగా నిట్టూర్చారు

"ఉ!.... నాటికీ నేటికీ రామ్మూర్తి ఒక్కలావున్నాడు.... ఎవరి సహాయాన్నీ ఉచితంగా పొందలేని మహావ్యక్తి. అనేకసార్లు ఎంతోచేద్దామని ప్రయత్నించాను. 'అలాచేస్తే నీ ప్రాణస్నేహితుడ నీకు దూరమయిపోతాడు గుర్తుంచుకో'- అనిబెదిరించి నా చేతులు కట్టేశాడు.... ఇంత కాలానికి, నీ భవిష్యత్తును నా చేతిలోపెట్టి "శీనూ! నేనే ఓడిపోయాను! మా శేఖరాన్నినీకు అప్పగిస్తున్నాను"- అంటూ చాలా చాలా వ్రాశాడులే.... ఏది ఎలావున్నా, నీ రాకమాకు చాలా ఆనందాన్ని కలిగించింది...." అంటూ ఓ సారి శేఖరంవైపు విశితంగాచూసి!

"నీకు మంచి ఉద్యోగంచూసి- నిన్ను ఓదారిలో పెట్టేదాకా. ఆ బాధ్యతంతామాది.... నువ్వు మాయింట్లోనే వుండాలి! నీకు ఏ

ోటూ రానీయకుండా చూసుకునేందుకు నీరజవుంది !.... అన్నట్టు
రజ తెలుసుగా.... మా అమ్మాయి.... అదిగో మాటలోనే
చ్చింది"— అంటూ అప్పుడేలోపలకువచ్చిన నీరజను శేఖరానికి
రిచయంచేశారు శ్రీనివాసరావుగారు.

రాజయ్య కాఫీ పలహారాలు తీసుకొచ్చాడు....

శేఖరం చాలా మొహమాటపడ్డాడు.... "భోజనంచేసి వచ్చా
ండీ"- అని అంటున్నా వదల్లేదు.... కాఫీమాత్రంతీసుకున్నారు
ద్దరూ.... నీరజకూడా వాళ్ళ సంభాషణలో పాల్గొంది....

రామ్మూర్తి, శ్రీనివాసరావుగారూ బాల్య స్నేహితులు....
ంతస్థులు వారిని ఎన్నడూ వేరుచేయలేదు.... దూరపు బంధువు
నిపోవటంతో, హైదరాబాద్‌వచ్చేసి, తనకు సంక్రమించిన అంతు
ేని భాగ్యంతో కుబేరుడయ్యాడు శ్రీనివాసరావు.... 'నువ్వ కూడా
హైదరాబాదు వచ్చెయ్'- అని ఎంత బ్రతిమలాడినా 'ససేమిరా
ానన్నా'రు రామ్మూర్తిగారు. 'అవసరం కలిగినప్పుడు తప్పకుండా
సహాయాన్ని పొందుతాను.... ప్రస్తుతం నన్ను మొహమాట
పెట్టకు' అని దృఢంగా చెప్పారుకూడా....

హైదరాబాదు మకాంమార్చిన కొత్తలో- శ్రీనివాసరావుగారు
రచుగా శీతానగరం వెళ్ళివస్తూండేవారు.... రాను రాను ఆ రాక
ోకలూ తగ్గిపోయాయి, రామ్మూర్తిగారు ఆయననుంచి ఏ విధమైన
సహాయాన్నీ ఎన్నడూ పొందలేదు.... ఆయన ఆత్మగౌరవం,
ఆయన పట్టుదలా తెలిసిన శ్రీనివాసరావుగారు ఎప్పుడూ ఏ విధం
ాసూ రామ్మూర్తిగారిని బలవంతం చేయలేదు.... పిల్లల చదువుల
కైనా తన సహాయాన్ని కోరలేదే అని ఎంతో బాధపడేవారు
శ్రీనివాసరావుగారు. అలాంటి రామ్మూర్తిగారు శేఖరాన్ని తన
ద్దకు పంపినందుకు, ఆయన ఆనందానికి అవధులేలేకపోయాయి....

తమ యింట్లో వుండిపొమ్మని బలవంతంచేసినా ఎలాగో
ప్పించి, శ్రీనివాసరావుగారింట్లోంచి బయటపడిన శేఖరం ఊపిరి
గట్టిగా పీల్చుకున్నాడు.... బంగారు పంజరంలోంచి బయటపడిన
ామచిలుకలావుంది అతని మనస్సు.... నరేష్ చెప్పిన ప్రకారం
స్సు పట్టుకుని సులువుగానే ఇల్లు చేరుకున్నాడు.... బట్టలు

ార్చుకుని, కాళ్లూచేతులూ కడుక్కుని, ఫాన్ వేసుకుని హాయిగా మంచంమీదవాలి. సుఖనిద్రలోకి జారిపోయాడు శేఖరం....

సాయంత్రం నరేష్ వచ్చి నిద్రలేపేదాకా మెలకువరాలేదు. సాయంత్రం స్నానంచేసి ఇద్దరూ బయటకు వెళ్ళారు.... రాత్రి ఎనిమిదిగంటలదాకా తిరిగి, దారిలో హోటల్లో భోజనంకూడా ముగించుకుని ఇల్లు చేరుకున్నారు....రాత్రి చాలా సేపు కబుర్లుచెప్పు కున్నారు ఇద్దరూ....కొత్త జీవితంలో మొదటిరోజు అలా గడిచి పోయింది శేఖరానికి....!

ఆ మర్నాటి ఉదయం ఆలస్యంగా లేచాడు శేఖరం.... రోజు శ్రీనివాసరావుగారింటికి పోదల్చుకోలేదు. నరేష్‌కూడా సుకు శెలవుచీటీ పంపేశాడు. రోజంతా ఇద్దరూ కలసి తెగ గారు. చార్‌మినార్, జుమ్మామశీదు, హైకోర్టు, ఉస్మానియా ఆస్పత్రి – అన్నీ తిరిగి చూసి సాయంత్రానికి కాలాపహాడ్ ఎక్కి వెంకటేశ్వరస్వామివారి పాలరాతి దేవాలయానికి వెళ్ళారు....

శేఖరం ఆనందం అంతా ఇంతా కాదు.... స్వర్గంనుండి గంధర్వలోకం వెడుతూ తమ పుష్పక విమానాన్ని కొంచెంసేపు ఆ కొండమీద ఏ గంధర్వులో ఆపి, ఏ క్షణంలోనయినా అక్కడ్నించి అంతరిక్షానికి ఎగిరిపోతారేమో అనిపించింది....స్నిగ్ధధవళకాంతుల మధ్యలో, ఆదిమధ్యాంత రహితుడైన శ్రీనివాసుని నల్లనిమెరుపు మేనిలోని వింతకాంతులు చూస్తూంటే, భక్తుల హృదయాలలోని చీకట్లను తానుమ్రింగి వెన్నెల వెలుగుల్ని గర్భగుడిద్వారా పైకి వెదజల్లుతున్నాడా అన్నట్టు తోచింది – ఆ తెల్లని చలువరాతి మందిరాన్ని చూస్తూంటే....

దూరంగా హుసేన్‌సాగర్‌లో టాంక్‌బండ్‌మీద దీపాల కాంతి అలలపై పడి, అవి మిలమిలా మెరుస్తున్నాయి....వాహనాల హెడ్‌లైట్లు భూమిమీద నక్షత్రాలు పరుగులు తీస్తున్నట్లుగా వున్నాయి....గాలి సుగంధపరిమళాన్ని చిమ్ముతోంది. అప్పుడప్పుడే ప్రకృతిలోకి అడుగుపెట్టిన నిశీకాంత నగర సౌందర్యాన్ని మరింత శోభాయమానంగా అందిస్తోంది.... ఇంతకాలమూ తాను ఎరిగిన భూలోకం కాదేమో అనిపించింది శేఖరానికి....ఇది స్వప్నప్రపంచం కాదు....అలాంటి అద్భుతదృశ్యాన్ని చూడగలగటం నిజంగా తపః

ఫలం! ఆ సౌందర్యాన్ని ఎవరు గుర్తించలేరో, దిగంతాల వంయ్య రేఖ చేతులుచాచి పిలిచే పిలుపు ఎవరికి అందదో, వారి దృష్టిలో ఈ ప్రపంచం ఎన్నడూ నిలవదు....

శేఖరం మదిలో హఠాత్తుగా హరిత మెదిలింది.... ఆవెంటనే నీరజకూడా గుర్తుకు రావటం ఆశ్చర్యం కలిగింది....

హరిత.... నీరజ!

ఒకరు ముద్దమందారం.... మరొకరు గులాబీపుష్పం....

నరేష్ పలకరింపుతో వాస్తవానికి వచ్చాడు శేఖరం.... ఇద్దరూ కొండదిగి వచ్చేశారు....వాటిదృశ్యం శేఖరం మనసులో శాశ్వితముద్ర వేసింది....

# 3

ప్రేమమావ ఇంటినుంచి తిరిగివచ్చిన గోపాలం సరాసరి తన గదిలోకి వెళ్ళిపోయాడు, హరితవచ్చి మంచినీళ్ళు ఇచ్చింది. అంతలో వంటింట్లోంచి వర్ధనమ్మగారు వచ్చి, తన అన్నగారింటి క్షేమ సమాచారాలు అడిగి, "సరళ ఎలావుంది బాబూ" అని అడిగింది....

"బాగానేవుంది! మావయ్య రెండు మూడురోజుల్లో వస్తానని చెప్పమన్నాడు" - కాళ్లు కడుక్కునేందుకు బావిదగ్గరకు వెళ్ళిపోయాడు గోపాలం, అప్పుడు రామ్మూర్తిగారు ఇంట్లో లేరు....

రామ్మూర్తిగారికి ఇద్దరే సంతానం.... అదీ లేక లేక చాలా కాలానికి పుట్టారు. అంతకు ముందు చంద్రశేఖరాన్ని దగ్గరకు చేరదీసిన వేళావిశేషమేనని ఆ భార్యభర్తలిద్దరికీ నమ్మకం....

గోపాలానికి చదువు అట్టే చురుగ్గా వచ్చిందికాదు.... కానీ పట్టుదల ఎక్కువ. ఏదైనా అనుకుంటే అది పూర్తిచేసేదాకా నిద్ర పోడు, శేఖరం అంటే ప్రత్యేకమయిన గౌరవం లేదు. అలా అని అసూయగానీ, ఏహ్యభావంగానీ అసలేలేవు. శేఖరానికి మాత్రం గోపాలం అంటే ఎంతో ప్రేమ, హరితమీద మరెంతో ఆపేక్ష.... హరిత హైస్కూలుతోనే చదువు ముగించేసింది.... వీణ నేర్చుకుంటోంది....

శేఖరం 'ఇంటర్మీడియట్' పాసయినప్పుడు గో
క్లాసు ఫెయిలయ్యాడు. గోపాలానికి ట్యూషన్ పె
స్కూల్లో చదివించటానికీ, శేఖరాన్ని బి.ఎస్సీలో చేర్పి
ఆర్థికంగా తట్టుకోలేక చాలా బాధపడ్డారు రామ్మూర్తిగారు.

"ఇద్దరి చదువులూ ఒక్కసారి భరించటం కష్టం, గోప
ప్రయివేటుగా చదువుతాడు.. శేఖరాన్ని బియ్యేస్సీలో చేర్పించండి"
అని వర్ధనమ్మగారు అన్నప్పుడు రామ్మూర్తిగారి కళ్ళు చమర్చాయి.
అయినా భార్య ఔదార్యం ఆయనకు తెలియంది కాదు....

ఎలాగయితేనేం శేఖరానికి బియ్యేస్సీ చెప్పించారు. గోపాలం
ఇంకా 'ఇంటర్'తో కుస్తీలు పడుతూనే వున్నాడు.... హరిత పెళ్లి
షయమే ప్రస్తుతం రామ్మూర్తిగారి సమస్య, ఎలాచెయ్యాలో, ఏం
పెట్టి చేయాలో అర్థంకాని పరిస్థితిలో వున్నారు.

ఆరాత్రి చాలాసేపు భార్యాభర్తలిద్దరూ ఆవిషయమే మాట్లా
డుతూ కూర్చున్నారు. హరిత ఏదోనవల చదువుతూ పడుకుందన్న
మాటేగానీ, వారిమాటలు అస్పష్టంగా వినిపిస్తుండటంవల్ల, మనస్సు
కథలో లగ్నం కాలేక పోతోంది. తల్లితండ్రులకు, తనపెళ్లి ఎంత
పెద్ద సమస్యగా తయారయిందో తల్చుకుంటూంటే, ఏదోబాధ సుళ్లు
తిరుగుతోంది, రాత్రి ఎప్పుడోకానీ హరితకు నిద్ర పట్టలేదు....

రాత్రి ఎంతభారంగా గడచి తెల్లవారిందో, ఆరోజు అంతకు
మించిన ఆనందం, ఆ యింటిలో చోటు చేసుకుంది.. శేఖరం దగ్గ
ర్నుంచి ఆ ఉదయమే ఉత్తరం వచ్చింది.తనకు మంచి ఉద్యోగం
దొరికి నట్టూ - శ్రీనివాసరావుగారి రికమెండేషన్‌కు సాయం, తాను
'బ్యాంక్' పరీక్షల్లో ఉత్తమశ్రేణిలో పాసయినట్టూ - జాయిన్ కావ
టానికి వారం రోజులు గడువుంది కనుక - అందర్నీ చూడటానికి
ఓసారి వస్తున్నట్లూ రాశాడు. అందుకే అందరికీ ఎంతో ఆనందంగా
వుంది.. శేఖరం, ఆవూరు విడిచి వెళ్లి మూడునెలలే అయినా,
వాళ్ళందరికీ ఎన్నోయుగాలయినట్టు అనిపిస్తోంది....

ఆమర్నాడే శేఖరం వచ్చాడు. ఇల్లంతా సందడిగా వుంది.
రామ్మూర్తిగారు, శేఖరం ద్వారా ఎన్నో విషయాలు విన్నారు. శ్రీని
వాసరావుగారి గురించి అడిగారు. వారుచేసిన సహాయాన్ని వివరంగా
చెప్పి, వారింట్లో ఉండమని తనను బలవంతం చేసినా, తాను ఉండ

షవద్ద వుంటున్నాననీ చెప్పాడు శేఖరం. హరితసం-
భాషణలో అప్పుడప్పుడు కల్పించుకుని ఒకటీ అరా మాటలు
గంగా వినటమే తన వంతుగా కూర్చుంది. శేఖర్‌కి ఇష్ట
మైనవి రాగా రెలూ - పాయసం వండటంలో, వర్ధనమ్మగారు
హడావుడిగా అక్కడోకాలూ, ఇక్కడోకాలూ పెడుతున్నారు. వాళ్ళ
దగ్గర గోపాలం కాసేపు మాత్రమే కూర్చుని బయటకు వెళ్లి
పోయాడు....

శేఖరం మనసునిండా హరితే నిండిపోయింది. తనకు ఉద్యో
గంకూడా దొరికింది కాబట్టి, పెళ్ళి విషయం తానే ధైర్యంగా అ
గేయవచ్చు.. హరితను పెళ్లిచేసుకుంటే, రామ్మూర్తిగారి కుటు
బాన్ని - తనతోనే వుంచుకుని, అలాగైనా వారి ఋణం తీర్చు
కోచ్చు, శేఖరం మనసునిండా ఇంకా అలాంటివే ఏవేవో కోరికలు
పరచుకుని వున్నాయి....

ప్రతిరోజూ సాయంత్రం రామ్మూర్తిగారికి, దక్షిణం వైపున
వున్న వారిపొలం వద్దకు వెళ్లి తిరిగిరావటం అలవాటు. ఆరోజు
కూడా ఆయన బయల్దేరుతూంటే, శేఖరం 'నేను మీతో అలా
పొలం వైపు వస్తాను" అంటూ అనుసరించాడు....

సీతానగరంలో కాలు పెట్టిన దగ్గర్నుంచీ అనిర్వచనీయమైన
ఆనందాన్ని పొందుతున్నాడు శేఖరం.. ఆ గాలీ, ఆ నీరూ - ఆ
ఊరూ - అన్నీ కన్నతల్లిలాంటివి.. తన కన్నతల్లి ఎవరో తనకు
తెలియక పోయినా, పార్వతీదేవిలాంటి వర్ధనమ్మగారే తనకు ఆలోటు
తీర్చారు.... అయినా తల్లిలేని లోటును తన పసితనంలోనే మరచి
పోయాడు....

ఇప్పుడు తానుహరితను పెళ్లిచేసుకుంటే ఆ కుటుంబంతో
తనకున్న అనుబంధం, బంధమై, శాశ్వత మవుతుంది. ఆ విషయం
రామ్మూర్తిగారి దగ్గర ప్రస్తావించాలనే ఉద్దేశ్యంతోనే తానుకూడా
ఆ రోజు ఆయనతో పొలానికి బయల్దేరాడు....

కాలవగట్టున కూర్చున్నారు ఇద్దరూ.... సంధ్యారుణిమ
దీప్తివంతంగా వుంది.... ఇళ్ళకువెళ్లే పశువులూ, గూటికి చేరుకో
వాలనే తపనతో బారులు కట్టిన పక్షులూ.... ఎంతో మనోహరంగా
వుంది ప్రకృతి....

ఆ ప్రకృతిలోకి చూస్తూనే - హరిత విషయాన్ని ఎలా ప్రస్తావించాలా అని ఆలోచిస్తున్నాడు శేఖరం.... అంతలో రామ్మూర్తి గారే అన్నారు -

"బాబూ ! భగవంతుడు నీకో దారి చూపించాడు.... నిన్ను పెంచి ఇంతవాడ్ని చేసినందుకు నాకు చాలా గర్వంగా వుంది. ఇక నిన్నో యింటివాడ్ని చేసేస్తే-నా బాధ్యత పూర్తిగా తీరిపోతుంది"-

శేఖరం గుండె దడదడ లాడింది.... హరితను చేసుకొమ్మని రామూర్తిగారు తనను అడుగుతారు.... ఆ ఆలోచన వచ్చిన శేఖరం మరింత ఆసక్తిగా ఆయన కళ్ళల్లోకి చూశాడు....

"శేఖరం !.... ఇపుడు నీకో కథ చెప్పాలనుకుంటున్నాను.. అసలు ఎప్పుడో చెప్పాల్సింది.... కానీ, సమయం వచ్చినప్పుడు చెప్పవచ్చునుకుని అశ్రద్ధచేశాను....

ఏమిటీ అన్నట్లు చూశాడు శేఖరం, రామ్మూర్తిగారు కథ చెప్పటం ప్రారంభించారు....

* * * *

రామ్మూర్తీ, కృష్ణమూర్తీ, అన్నదమ్ములు. రామ్మూర్తి చిన్నవాడు.... కృష్ణమూర్తి పేరుకు తగినట్టే స్త్రీలోలుడు....ఉన్న ఊరునూ, కన్నవారినీ వదిలి, మునసబుగారమ్మాయితో వెళ్లి పోయాడు.... ఆ తరువాత కొన్నాళ్లకు, ఆ అమ్మాయి ఇంకెవరి తోనో లేచిపోయింది. ఇంటికి రావటానికి మొహం చెల్లక, కృష్ణ మూర్తి మిలట్రీలోకి వెళ్లిపోయాడు.. చాలాకాలం అతనిజాడ తెలి యనే లేదు....

ఓరోజురాత్రి.... కుంభవర్షం కురుస్తోంది. వీధితలుపులు ఎవరో దబదబా బాదుతున్నారు.... తలుపు తీయాలా వద్దా అని చూస్తున్నాడు రామ్మూర్తి.... తండ్రితీయవద్దన్నాడు.... తల్లి జబ్బు మనిషి, ముసుగు పెట్టుకుని పడుకుని వుంది.... రామ్మూర్తి భార్య వర్ధనమ్మ వెళ్లి తలుపు తీసింది.... వర్షంతోదాటు లోపలకు దూసు కుని వచ్చిన మనిషిని చూసి అందరూ నిర్ఘాంతపోయారు.. ఆ మనిషి భుజంపైనున్న పసివాడు చలికీ, ఆకలికీ తట్టుకోలేక గుక్క- పట్టి ఏడుస్తున్నాడు.. వర్ధనమ్మలోని మాతృత్వం మేల్కొంది.. తటాలున పసివాడిని అందుకుని. తనగుండెలకు అదుముకుంది ...

ముసలాయన కళ్లు కోపంతో ఎరుపెక్కాయి.... లాంతరువత్తి పెద్దదిచేశాడు రామ్మూర్తి.... ఆ వెలుగులో, అందరూ ఆ మనిషి వైపు చూశారు....

అతను కృష్ణమూర్తి!.... తూలిపడబోతున్న అతన్ని తల్లి మంచంమీద కూర్చోబెట్టారు.... ఎన్నోఏళ్ల తర్వాత వచ్చిన కన్నకొడుకును చూసీ – అతని పరిస్థితిని చూసీ – ఆ తల్లి హృదయ విదారకంగా విలపించింది.. మంచంచుట్టూవున్న తన ఆత్మీయుల నందర్నీచూసి ఎంతో తృప్తిగా నిట్టూర్చి క్షణంసేపు కళ్లు మూసుకున్నాడు కృష్ణమూర్తి....

"నన్ను క్షమించండి! మీ అందర్నీ వదిలి వెళ్ళిపోయి. మళ్ళీ ఇన్నేళ్ళకు రావలసి వచ్చింది! కారణం ఆ పసికందు!"– కృష్ణమూర్తి మాటలు తడబడుతున్నాయి.

లాంతరువత్తి రెపరెపలాడుతోంది గాలికి.... మూసిన తలుపులు ఎవరో తోస్తున్నట్లే చప్పుడవుతున్నాయి.... ఉండిఉండి భయంకరంగా ఉరుములు ఉరుముతున్నాయి. వాతావరణంబీభత్సంగా వుంది....

"తాడూ బొంగరం లేకుండా ఎంత విచ్చలవిడిగా తిరిగిన పురుషునికైనా జీవితంలో చివరికి ఒకేఒక స్త్రీతో బంధం బలపడుతుంది.... అలాంటివారిని మృత్యువుకూడా వేరుచేయలేదు! వనజతో నాకు అలాంటి అనుబంధమే ఏర్పడింది .... ఆమె కులమూ గోత్రమూ మనవికావు.... కానీ ఆమె దేవత.... నా జీవితాన్నే మార్చివేసింది.... మనిషిగా నేను లేచేటప్పటికి ఈ పసికందును, తన ప్రతిరూపంగా నాకు మిగిల్చి, ఆమె మరణించింది.... వీడ్ని పెంచి పెద్దచేయటంలోనే, నా జీవితానికి సార్థకతను చేకూర్చుకోవాలనుకున్నాను.... కానీ, భయంకరమైన కేన్సరువ్యాధి నన్ను వరించింది.... ఇక అట్టేరోజులు బ్రతకనని డాక్టర్లు చెప్పారు! ... ఈ చివరి క్షణాల్లో– మిమ్మల్నందర్నీచూసి, నా బిడ్డను మీ చేతుల్లో పెట్టాలని కొండంత ఆశతో ఇక్కడికి చేరుకున్నాను" – కృష్ణమూర్తిమాటలు దీనంగా వున్నాయి.... మాట్లాడలేనంతగా ఆయన పడిపోతున్నాడు.... 'రోజులమాట దేవుడెరుగు, ఇక అతనిప్రాణం గంటల్లోనేవుందా' అనిపించింది....

ముసలాయననుంచి ఓదార్పుమాటలు వినవస్తాయేమోనని రామ్మూర్తీ వర్ధనమ్మాకూడా ఎదురుచూశారు.... కృష్ణమూర్తి లేచి వర్ధనమ్మచేతుల్లోంచి తన కొడుకుని తీసుకున్నాడు.... ఓసారి ఆ పసివాడ్ని తన హృదయానికి హత్తుకొని రామ్మూర్తిదగ్గరకు వెళ్ళాడు.

"తమ్ముడూ! లోకందృష్టిలో నేను భ్రష్టుడ్ని!.... నన్ను అందరూ ఏనాడో మరచిపోయారు.... 'వీడు ఫ[illegible]నావాడి కొడుకు వీడితల్లి ఎవరో వీడికే తెలియదు' అనే విమర్శలు వీడి చెవిన పడకూడదు!.... దిక్కులేని అనాధను తెచ్చి పెంచుకుంటున్నామని ఒక్కమాటచెప్పి లోకంనోరు మూసెయ్యండి. నాకొడుక్కి ఇకి తల్లీ తండ్రీ మీరే కావాలి"— అంటూ ఆ పసివాడ్ని రామ్మూర్తికి అప్పగించాడు.

ఆ తర్వాత రెండురోజులకే కృష్ణమూర్తి మరణించాడు... ఇంటిల్లిపాదీ నిశ్శబ్దంగానే విలపించారు....మరికొన్నినెలల తేడాతో వృద్ధులుకూడా దాటిపోయారు .... పిల్లలుపుట్టే వయసు దాటిపోతుందేమోననే భయంతోవున్న వర్ధనమ్మకు, ఆ పసివానిపెంపకం నూతనశక్తిని కలిగించింది.... ఆ తర్వాత ఏడాది తిరిగేసరికి గోపాలం పుట్టాడు.... ఆ తర్వాత హరిత పుట్టింది.

* * *

"నువ్వు స్వయంగా నా అన్నకొడుకువి!.... మనది రక్త సంబంధం! తెలిసిందా బాబూ"—

శేఖరానికి మిగతామాటలు వినిపించటం మానేశాయి... గుండెల్లో అగ్నిపర్వతాలు పగిలిపోతున్నాయి. కళ్ళల్లో జలప్రళయం వచ్చి భవిష్యత్తులోని మధురోహలను తుడిచిపెట్టేసింది!....

హరిత!

ఇన్నాళ్ళూ హరితపై తాను ఏర్పరచుకున్న భావనకు సమాధికట్టి పైకిలేచాడు.... అతని ఆసరాతో రామ్మూర్తిగారుకూడా లేచారు.

* * *

హైదరాబాద్ తిరిగి వచ్చేశాడు శేఖరం.... కానీ అతనిలో మునుపటి చలాకీతనం లేదు.... దానికి బదులు గాంభీర్యం చోటు

చేసుకుంది.... కొత్తఉద్యోగపు ఆనందం - ఉత్సాహం అతనిలో మచ్చుకైనా కనిపించటంలేదు.... యాంత్రికంగా 'బ్యాంక్'కు వెళు తున్నాడు.... వస్తున్నాడు... అంతే!....

మొదటినెల జీతం అందుకోగానే, అందరికీ బట్టలుకొని ఇవ్వాలనుకున్నాడు శేఖరం.... కానీ మళ్ళీ సీతానగరం వెళ్ళి రావా లంటే తన కెందుకో ఇప్పుడు చెప్పలేనంత దిగులుగా వుంది.... అందుకే ఎలాగో నరేష్‌ను బ్రతిమాలి, అతనిచేత శెలవుపెట్టించి, సీతానగరానికి ప్రయాణం కట్టించాడు.... రెండువందలు ఖర్చుపెట్టి అందరికీ బట్టలుకొన్నాడు.... చార్‌మినార్‌దగ్గరున్న చుడీబజారులో హరితకోసం రాళ్ళగాజులు కొన్నాడు....నరేష్‌కి అన్నీ యిచ్చి బస్ ఎక్కిస్తూ.

"హరితకు చెప్పు! తనపెళ్ళికి బంగారుగాజులు చేయిస్తా నని"- అన్నాడు.

సీతానగరం వెళ్ళిన నరేష్ మూడవరోజుకుతిరిగివచ్చాడు.... అతన్ని చూడగానే, తనవారిసందరినీ ఒక్కసారిగా చూసినంత ఉత్సాహం కలిగింది శేఖరానికి.... రామ్మూర్తిగారు చాలానీరసంగా వున్నారనీ - తమకు పంపిన బట్టలు చూసి వర్ధనమ్మగారు కంట తడిపెట్టుకున్నారనీ - తన చీరా - రాళ్ళగాజులూ చూసుకుని హరిత ఎంతగానో మురిసిపోయిందనీ నరేష్ చెప్పినప్పుడు, ఎంతో తేలిక పడింది శేఖరం మనస్సు.

మంచిఇల్లు ఏదైనా దొరికినతరువాత, ఎలాగైనా రామ్మూర్తి గార్ని ఒప్పించి, వాళ్ళందర్నీ తనదగ్గరకు తెచ్చుకోవాలని గట్టిగా నిశ్చయించుకున్నాడు.

ఆతరువాత నెలరోజులయినా తిరక్కుండా రామ్మూర్తిగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది....గోపాలానికి పెళ్ళి! మేనరి కమే....! పెళ్ళికి వెళ్ళాలని ఎంతగానో ఉబలాటం పడ్డాడు శేఖరం.... కానీ ఉద్యోగంలో చేరి ఇంకా మూడునెలలుకూడా కాలేదు.... పైగా అదేసమయంలో బ్యాంకులో ఏదో 'ఆడిట్'కూడా జరుగుతోంది.... ఎంత ప్రయత్నించినా శలవు దొరకలేదు శేఖరానికి.

గోపాలంపెళ్ళి జరిగిపోయింది.... పెళ్ళయిపోయిన పది

రోజులకు విశేషాలతో రామ్మూర్తిగారు మళ్ళీ ఉత్తరం రాశారు. పెళ్ళిపందిట్లో శేఖరంలేని లోటు ప్రతిక్షణం కనిపించిందనీ - ఏ క్షణాన్నయినా శేఖరం రావచ్చునని హరిత ఎదురుచూసిందనీ రాశారు.... గోపాలం మేనమామకు మగపిల్లలు లేకపోవటంచేత, 'పొలం పుట్రా చూసుకుంటూ అక్కడే వుందువుగాని రమ్మంటే' - గోపాలం మావగారింటికి ఇల్లరికం వెళ్ళిపోయాడనికూడా రాశారు ఆయన.

శేఖరం చాలా బాధపడ్డాడు. హరిత పెళ్ళి అయ్యేవరకైనా గోపాలం ఆగివుంటే బాగుండేది.... తన స్వార్థం చూసుకుని వెళ్ళిపోయాడు.... ఏమిటో!.... ఎవరి కెవరో!

అప్పుడప్పుడు శ్రీనివాసరావుగారింటికి వెళ్ళివస్తూనే వున్నాడు శేఖరం. నరేష్‌కూడా అతనితో కలసి తరుచుగా వెడుతూండేవాడు. రానురాను వారి ముగ్గురిమధ్యా సాన్నిహిత్యం పెరుగుతూ - ఎప్పుడైనా వెళ్ళటం ఆలస్యమయితే, శ్రీనివాసరావు గారికి కోపం వచ్చేది.

అంతకుముందు శ్రీనివాసరావుగారిలో కనిపించిన గంభీరతా - గ్లానీ - తగ్గిపోయి - వాళ్ళతో సహానంగా ఉత్సాహాన్ని కనపరచేవారు. వాళ్ళముగ్గురిమధ్యా ఎన్నోవిషయాలు దొర్లిపోయేవి....మరీ పొద్దుపోయినప్పుడు, రాజయ్య శేఖరానికీ, నరేష్‌కి కూడా భోజనం ఏర్పాట్లు చేసేవాడు. నీరజకూడా వాళ్ళతోకలసి కబుర్లు చెబుతూండేది!

శ్రీనివాసరావుగారికి కొంతకాలంగా ఒక ఆలోచన మెదులుతోంది. ఆయనకు ఓపెద్ద అడివి వుంది.... కొన్ని ఎకరాల మేరకు అడివి కొట్టించి వ్యవసాయానికి వీలుగా భూమిని చదును చేయించాలని! ఆ విషయాన్ని ఒకరోజు సాయంత్రం బయటపెట్టారు.

'బ్రహ్మాండంగా వుంటని' నరేష్ అన్నాడు. శేఖరం ఏమీ మాట్లాడలేదు, నీరజమాత్రం - 'ఎందుకు డాడీ! అనవసరంగా శ్రమ! -' అంది.

"అసలు 'భూమి చదును చేయించాలా వద్దా'అన్న విషయం తర్వాత చూద్దాం. ముందు మనమంతా అర్జంటుగా ఆ అడవులకి పోయి - వనసౌందర్యాన్ని వీక్షించాలి" - నరేష్ మాటలకు నీర

విరగబడి నవ్వింది. నరేష్ మాటలంటే నీరజకు ఎంతో ఇష్టం.... శేఖర్‌లోని గంభీరత అంటే మరీ ఇష్టం.

"ఓయస్.... తప్పకుండా వెడదాం? ఏర్పాట్లు చేస్తాను"....
ఎంతో ఉత్సాహంగా అన్నాడు శ్రీనివాసరావుగారు.

ఈమధ్య తండ్రిలోని నిర్లిప్తతా, గాంభీర్యమూ తగ్గిపోయి, ఆ సాధనంలో పూర్వపు ఛలాకీతనమూ, ఉత్సాహమూ, కనిపించటంచూసి ఆశ్చర్యపోతోంది నీరజ.

ఒకప్పుడు శ్రీనివాసరావుగారు జంతువుల్ని వేటాడ్డంలో మంచి ప్రావీణ్యాన్ని సంపాదించుకున్నారు.... ఆయన వేటకు వెళ్ళారంటే కనీసం ఓ పెద్దపులినో, చిఱుతపులినో, కొట్టందే ఇంటికి తిరిగి వచ్చేవారుకాదు.... నీరజ ఆ సంగతే శేఖర్‌తోటీ నరేష్‌తోటీ చెప్పింది.... విస్తుపోయారు వాళ్ళిద్దరూ.

"మా నాన్నగారు వేటాడిన జంతువుల్ని చూశారంటే ఆశ్చర్యపోతారు తెలుసా?.... రండి చూపిస్తాను"- అంటూ లేచింది నీరజ.

గడచిపోయిన కాలాన్ని నెమరువేసుకుంటూ - కళ్ళుమూసుకుని - సోఫాలోనే కూర్చుండిపోయారు శ్రీనివాసరావుగారు.... శేఖరం, నరేష్‌లు నీరజను అనుసరించారు.

గార్డెన్‌లోంచి ఉత్తరదిశగా వెళ్లారు. అక్కడ ఓ అవుట్ హౌస్‌లాంటిది వుంది. తోటమాలి వచ్చాడు. తాళం తీసి, లైటు వేశాడు.. హాలులో అడుగుపెట్టిన శేఖరం ఘ్రమాన్పడి నిలబడిపోయాడు.. నరేష్ కెవ్వుమని అరిచాడు.. ఎదురుగా పెద్దపులి !.... క్షణంలో మీదపడి తన పంజాతో చావుదెబ్బ తీయటానికి సిద్ధంగా వున్న ఆ పులినీ, దాని మెరుస్తున్నకళ్ళనూ, భయంకరంగా తెరచిన నోట్లోని ఎర్రని నాలుకా, తెల్లని కోఱలూ,.... చూడగానే గుండె దడ దడ లాడింది ఇద్దరికీ ! ఆ హాలులో, ఎన్నోరకాల పులులూ, జడవిదున్నలూ, దుప్పులూ, లేళ్లూ, పక్షులూ, గోడలకు సింహం తలలూ, పెద్దపులీ చిరుతపులుల తలలూ, అన్నీ 'స్టఫ్' చేయబడివున్నాయి.... అన్నీ సజీవంగా విహరిస్తున్నాయా అన్న భ్రాంతిని కలిగిస్తున్నాయి.. నరేష్ శేఖరం చేయిపుచ్చుకున్నాడు.. అతని చెయ్యి సన్నగా వణకటం శేఖర్ గమనించక పోలేదు.

ఆ హాలుదాటి పక్కగదిలోకి వెళ్లారు. ఆ గదిలో - బోనులో ప్రత్యేకంగా వుంచిన పెద్దపులినిచూసి ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు.

"ఇదేమిటీ. చచ్చిపోయిన పులిని బోనులో పెట్టారు?"— ఆశ్చర్యాన్ని వ్యక్తంచేస్తూ అడిగాడు శేఖరం.... నీరజ కటకటాలకు తల ఆనించి ఆ పెద్దపులినే చూస్తోంది!" అన్నింటికంటే ఆ పులి మహా భయంకరంగా వుంది!" ఏ క్షణంలోనో. ఆ కటకటాలను ఛేదించుకుని, బయటకు వచ్చేసి, అక్కడి వాళ్ళందర్నీ గభాల్న మ్రింగటానికి సిద్ధంగా వున్నట్లు వుంది.

"నీరజా!"....

శేఖరం పిలుపువిని ఉలిక్కిపడి, అతనివైపు చూసింది.... ఆమెకళ్ళు ధారాపాతంగా కన్నీళ్ళను వర్షిస్తున్నాయి....

"ఏమిటీ నీరజగారూ!.... ఎందుకలా వున్నారు?" — ఖంగారుగా ఇద్దరూ అడిగారు.

కొన్ని క్షణాలకు తేరుకొని, "పదండి! అలా గార్డెన్‌లో కూచుందాం!...." అంటూ కళ్ళుతుడుచుకుని కదిలింది....

అందరూ గార్డెన్‌లో - కుర్చీలలో కూర్చున్న తరువాత రాజయ్య కాఫీ తీసుకొచ్చాడు.... కాఫీ త్రాగుతూ నీరజవైపు చూశాడు శేఖరం.... ఆమె ముఖం సంధ్యాకాంతిలో ఎర్రగా మెరుస్తోంది.... కళ్ళు, కుంకుమ అద్దినట్లున్నాయి.

"నీరజగారూ! మీ మౌనాన్ని భరించలేకుండా వున్నాం.... ఇలా 'సస్పెన్స్'లో వుంచేయటం భావ్యంకాదు" - నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ అన్నాడు నరేష్.

కర్చీఫ్‌తో కళ్ళూ, పెదవులూ తుడుచుకుని- ఓసారి ఆకాశం వైపుచూసి చెప్పటం ప్రారంభించింది నీరజ.... సర్విచెట్ల అంచుల మీదపడి మెరుస్తున్న నీరెండనుచూస్తూ వింటున్నాడు శేఖరం.

* * * *

శ్రీనివాసరావుగారు వేటకువెడితే, ఒక్కొక్కసారి రెండు వారాలదాకా వచ్చేవారుకాదు.... ఆయనకు వేటంటే అంత వెర్రి వ్యామోహం.... తమతోకూడా స్నేహితుల్ని తీసుకువెళ్ళేవారు.... అందుకే సకల సదుపాయాలతోటీ, ఆ అడవిలో చిన్న బంగాళా

కూడా కట్టించారు. వేట పూర్తిచేసుకుని వచ్చిన తరువాత, వారి యింటిలో సందడి అంతాఇంతా కాదు.... విందులూ, వినోదాలూ ఘనంగా జరిగేవి.

మహాలక్ష్మమ్మగారికి మాత్రం వేటంటే అసలు ఇష్టంవుండేది కాదు.... 'అన్నిరోజులూ మనవి కావనీ, చేతులారా అపాయాన్ని కొని తెచ్చుకోవద్దనీ' అనేకసార్లు హెచ్చరించేది ఆవిడ.... కానీ శ్రీనివాసరావుగారు ఆమె మాటలను లక్ష్యపెట్టేవారుకాదు.... పైగా నవ్వేసి ఆమె భుజాలుపట్టుకొని కుదిపేస్తూ— "ఇంత పిరికిదానివి నా భార్యగా ఎలా వచ్చావోయ్?.... నీ భయాలు, నా పిల్లలకు మాత్రం రాకూడదు"— అనేవారు.

ఓరోజు వేటకు సన్నాహాలు జరుగుతున్నాయి. అప్పుడు అనిల్‌కు పదమూడు సంవత్సరాలు.... అనిల్‌కంటే నీరజ మూడేళ్లు చిన్నది.... ఇద్దరూ అందంగా, ఆరోగ్యంగా ఏపిల్ పళ్ళల్లా వుండేవారు.

"హంటింగ్‌కి నేనూ! వస్తాను డాడీ"— అన్నాడు అనిల్ హఠాత్తుగా. శ్రీనివాసరావుగారు కొడుకును అమాంతంగా పైకెత్తి దించి.

"వెల్ మైబోయ్! పులికడుపున పులే పుడుతుంది.... ఇక నుంచీ నేను ఎప్పుడు వేటకు వెళ్ళినా, నువ్వుకూడా నాతోనే వుంటావు.... సరేనా? వెళ్ళి బట్టలు సర్దుకో!"— అన్నారు.

అదంతా చూసిన నీరజకు ఉక్రోషం ముంచుకొచ్చింది.

"డాడీ! నేనూవస్తానుడాడీ!" అంది.... బిల్డింగ్ అదిరి పోయేలా నవ్వేశారు శ్రీనివాసరావుగారు.

"ఆడపిల్లవి, నువ్వురాకూడదమ్మా! అదంతా చూస్తే జడుసు కుంటావు తెలిసిందా?"—

నీరజ చాలా అవమానం కలిగినట్లుగా ఫీలయింది....అక్కడ శ్రీనివాసరావుగారి స్నేహితులుకూడా వున్నారు.... వాళ్లుకూడా నవ్వేసరికి నీరజలో పట్టుదల ఎక్కువయింది.

"అదేం కుదరదుడాడీ! నేనూ వచ్చితీర్తాను! నాక్కూడా హంటింగంటే చాలా ఇష్టం...." కళ్ళనీళ్ళు గుడ్లలోనే కుక్కు కుంటూ రోషంగా అంది. అప్పటి కూతురు పరిస్థితీ, రోషం. ఆ

కళ్లూ చూసి శ్రీనివాసరావుగారు జారిపడ్డారు.

"సరే! నువ్వుకూడా వద్దువుగాని.... తయారవ్!"— అన్నారు.

నీరజ ఒక్క అంగలో తనగది చేరుకుంది.... వెడుతూ అనిల్ గదివైపు చూసింది. బట్టలు సర్దుకుంటున్న అనిల్ నీరజ వైపు చూసి చిలిపిగా నవ్వేడు.

"నేనూ గెలిచానులేవోయ్!- డాడీ నన్నుకూడా రమ్మన్నారు అన్నట్టుగా, కుడిచేతి గుప్పిడి ముడిచి. బొటనవ్రేలు పైకి ఎత్తి చూపించి. తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రమే రెండు జీపులు శ్రీనివాసరావుగారి బంగళా నుంచి బయలుదేరాయి.... ఒక జీపులో వేట సరంజామూ, రాజయ్యా.... రెండో జీపులో డ్రైవరు ప్రక్కన అనిల్, నీరజ, చివర శ్రీనివాసరావుగారూ కూర్చున్నారు.... వెనకాల ఆయన స్నేహబృందం.

పట్నందాటి- పల్లెలుదాటి- అడవికి చేరుకున్నాయి జీపులు ఎండ పూర్తిగా తగ్గిపోయి - వాతావరణం పూర్తిగా చల్లబడి పోయింది.... ఆకాశానికి చోటు ఇవ్వకుండా దట్టంగా పెరిగిన చెట్లవైపు - ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ చూస్తోంది నీరజ.... అనిల్ హుషారుగా పాటలు పాడుతున్నాడు....

చిన్నచిన్న కుందేళ్ళు జీప్ ముందునుంచి రోడ్డుకు అడ్డంగా పరుగెత్తుతున్నాయి.... అంతలోనే - ఎక్కడ్నించో మబ్బులు ముంచుకొచ్చాయి మరి కాసేపటికి హోరున వర్షం ప్రారంభ మయింది. ఆ వర్షలో అలా అడవుల్లోంచి ప్రయాణం చేయటం అద్భుతమైన వింత అనుభూతిని కలిగిస్తోంది అనిల్‌కి....

ఓ అరగంటపాటు కుంభవృష్టిగా కురిసిన వర్షం - మంత్రం వేసినట్టుగా మాయమయింది.... భూమి తడిసినవాసన కమ్మగావుంది.

బంగళాముందు రెండు జీపులూ ఆగాయి. అక్కడున్న నౌకరు హడావిడిగా వచ్చి, అందరికీ సలాంకొట్టి, సామాన్లు లోప లకు చేరవేయటం మొదలుపెట్టాడు.... వచ్చినవాళ్ళందరికీ, ఫ్లాస్కు లోని కాఫీపోసి అందించాడు రాజయ్య.

బైట వరండాలోవున్న కుర్చీల్లో కూర్చుని కాఫీ తాగుతూ

పేటమచ్చట్లు ప్రారంభించారు.... అప్పటికి రాత్రి ఎనిమిది గంట లయింది.... రాజయ్యా, బంగళా నౌకరూ కలసి వంట ఏర్పాట్లు చేశారు.... శ్రీనివాసరావుగారు పిల్లలిద్దరితోనూ లోపలకువెళ్ళారు...

"రాజయ్య భోజనం తయారుచేసి, పిలిచేవరకూ 'రెస్టు' తీసు కోండి!" అంటూ అక్కడున్న ఓ మంచంమీద నడుం వాల్చా రాయన.... అక్కడ మరోమంచంకూడా వుంది....దానిమీద అనిల్ నీరజా పడుకున్నారన్నమాటేగానీ, వాళ్ళదృష్టి అంతా అడవిమీదే వుంది. చిన్నప్పట్నించీ అరణ్యగాథలు వినివినీ వాళ్ళలో ఒక విధ మైన ఉత్సుకత పేరుకపోయివుంది.... ఇన్నాళ్ళకు, అనుకోని విధంగా ఈ ప్రయాణం తగలటం, ఇద్దరికీ మహదానందంగా వుంది.

అమర్నాథు అందరూకలసి అడవిలోకి బయల్దేరారు.... పేటకు అనువైన ప్రాంతాల్ని పరిశీలించారు. సాధారణంగా ఒక సారి పేటజరిగిన చోటుకు పెద్దపులులు రావు.... అందుకే స్థలాలు మారుస్తూంటారు. పగలంతా పేటకు అనువైన ప్రాంతాల్ని ఎన్ను కుని, చీకటిపడిన తరువాత పేటకు వెళ్ళాలని వాళ్ళ ఉద్దేశ్యం.... రాజయ్య ఆ సాయంత్రం తొందరగా వంట పూర్తిచేయించాడు....

భోజనాలయిన తరువాత, పిల్లలనుకూడా తీసుకుని బయల్దే రారు శ్రీనివాసరావుగారు.... బంగళాలో రాజయ్యమాత్రం వుండి పోయాడు.... పిల్లలిద్దరూ వెళ్ళటం రాజయ్యకు ఇష్టంలేదు.... వెళ్ళే ముందు అన్నాడుకూడా "మీరు వెళ్ళొద్దు అనిల్‌బాబూ!.... మీకు కథలు చెబుతాను వుండిపోండి" – అని!

రాజయ్య మాటలు వినిపించుకునే స్థితిలోలేడు అనిల్.

ఆరాత్రి అందరూ 'మాటు'వద్దకు చేరుకున్నారు. నిచ్చెనమీద నుంచి చెట్టుఎక్కారు. చెట్టుమీద 'మంచె' వుంది. మంచె మీద ఎండుగడ్డి, దానిమీద తివాసి పరచివుంది. సులభంగా ఏడెనిమిది మంది కూర్చోవచ్చు ... కూడావచ్చిన నలుగురు స్నేహితులూ, శ్రీనివాసరావుగారూ, పిల్లలూ పైకి ఎక్కింతరువాత, నిచ్చెన పైకి లాక్కున్నారు.

క్రిందచెట్టుకి కట్టిఉంచిన గేదె ఉండిఉండి భయంకరంగా, హృదయవిదారకంగా అరుస్తోంది.... రాత్రి గడిచిపోతోంది కానీ,

పులివస్తున్నజాడలు కనిపించటంలేదు.... మంచె మీదనుంచి చూస్తే, ఆ చీకటిలో, అరణ్యం అద్భుతంగా వుంది.... ఏవేవో జంతువులకళ్ళు గాజుగోళాల్లా మెరిసి మాయం అవుతున్నాయి. అందరితోబాటూ, అనిల్‌కూడా ప్రతినిముషం పెద్దపులికోసం ఎదురు చూస్తున్నాడు.... ఎవ్వరూమాట్లాడుకోవటంలేదు.... అతినిశ్శబ్దంగా వుంది.... అప్పుడప్పుడు ఎండుటాకుల శబ్దం, ఏవో జంతువులు ఆ ఆకులమీదనుంచి నడిచివెడుతున్న చప్పుడూ— ఎక్కడో గుడ్లగూబ కూతా- అవి తప్ప- మరేమీ వినిపించటంలేదు....

పులి రాకకోసం ఓ గంటసేపు ఎదురుచూసిన తరువాత, చప్పుడుకాకుండా, ఫ్లాస్కులోని కాఫీ వంచుకుని అందరూ తాగారు నీరజ నిద్రపోయింది.... చూస్తూవుండగానే తూర్పున తెల్లవారిపోయింది.

రెండోరోజు రాత్రి— మళ్ళీ అందరూ వెళ్ళారు.... ఓ రాత్రివేళ— వాళ్ళకు చాలా దగ్గర్లో పులికళ్ళు కనిపించాయి.... గేదె కట్టుగొలుసు త్రెంపుకోవటానికి బ్రహ్మప్రయత్నంచేస్తూ- విపరీతంగా అరుస్తోంది.... శ్రీనివాసరావుగారు తుపాకి సవరించుకుని— సిద్ధంగా కూర్చున్నారు.... కానీ పులి అక్కడకు రానేలేదు.... ఆ రోజుకూడా వేటసాగలేదు.... కానీ, పులి కనిపించిందన్న ఉత్సాహంతో మంచెదిగారు.

మూడోరోజు....

ఉదయం పెంద్రాళే భోజనాలుచేసి, పెద్దవాళ్ళందరూ నిద్ర పోతున్నారు.... అనిల్,నీరజా ఆటల్లోపడ్డారు.... బంగళాముందున్న యిసకలో పిచ్చుకగూళ్ళు కట్టుకున్నారు.... కాలు ఇసుకలో దూర్చి పెద్ద గూడుకట్టాడు అనిల్.... దానిద్వారంచుట్టూ అడివిపూలుగుచ్చి బాట ఏర్పరచాడు.... బాటకు రెండువైపులా పూలరెమ్మలు ఎంతో అందంగా అమర్చింది నీరజ.

ఆరాత్రి మళ్ళీ యథాప్రకారం హడావిడి.. అందరూ మంచె మీదకుచేరారు.... ఈసారి అందరికీ గట్టిగా వార్నింగు ఇచ్చారు శ్రీనివాసరావుగారు.... ఎవరూ గట్టిగా ఊపిరికూడా పీల్చటానికి వీల్లేదన్నారు.

అందరూ ఎదురుచూసినక్షణంరానేవచ్చింది.... గేదెచిందులు

త్రొక్కుతూ భయంకరంగా అరుస్తోంది.... దూరంనుంచి పెద్దపులి వస్తున్న అలికిడయింది.... శ్రీనివాసరావుగారు, ఆయన మిత్రులు మరో యిద్దరూ- గన్సు తీసుకుని రెడీగా వున్నారు.

గడియారంలో సెకన్లముల్లు గబగబా నడుస్తోంది.

దగ్గర్లోనే పులి అడుపు....

అనిల్ గుండెలు గుబగుబలాడాయి.... నీరజకు చెమటలు పోస్తున్నాయి.... కన్నుమూసి తెరచేటంతలో- పులి గేదెపైకి దూకటం- గన్ ప్రేలటం- అనిల్ భయంతో- మంచె పైనుంచి క్రిందకు పడిపోవటం జరిగిపోయింది—

శ్రీనివాసరావుగారి గురితప్పలేదు.... తుపాకీ దెబ్బతిన్న పెద్దపులి - అడవంతా మార్మోగేలా భయకరంగా అరచింది.... క్రింద పడిపోయిన అనిల్ - భయంతో బలంగా 'డాడీ' అని పిలిచాడు.

అంతే !....

పెద్దపులి ప్రాణం వదులుతూ - ప్రక్కనే పడివున్న అనిల్‌ను - తనపంజాతో బలంగా కొట్టింది !.. ఆ దెబ్బకు అనిల్ ప్రాణం అనంత వాయువుల్లో కలిసిపోయింది.

శ్రీనివాసరావు పిచ్చివారే అయిపోయారు.... చీకటి కరిగిపోయి వెలుగురేకలు విచ్చుకుంటున్న సమయంలో - గుండెల నిండా చీకటిని దాచుకుని - నిర్జీవుడైన అనిల్‌ను తీసుకుని - ఇంటికి బయల్దేరారు శ్రీనివాసరావుగారు ! జీపు బయల్దేరుతూంటే - అంతకు ముందురోజు సాయంత్రం, అనిల్ ఇసుకలో కట్టిన దేవాలయం - దానిచుట్టూ పడిపోయిన అడవి పువ్వులూ - రెమ్మలూ కనిపించాయి.... అవిచూసి రాజయ్య గుండె బాదుకున్నాడు.... శ్రీనివాసరావుగార్ని, రాజయ్యనూ, కూడా వచ్చిన స్నేహితులు ఓదార్చటానికి ప్రయత్నించారు.

* * *

గార్డెన్‌లో లైట్లు ఎప్పుడు వెలిగాయోకూడా శేఖరం, నరేష్‌లు గమనించనేలేదు. హృదయవిదారకమైన ఆసంఘటన వింటూ, అచేతనంగా వుండిపోయారు.

నీరజ కళ్లు తుడుచుకుంది.

"అప్పటినుంచీ మానాన్నగారు వేటమానేశారు, ఆ పెద్ద పులి చనిపోయినా, కక్ష తీరక బోనులో పెట్టించారు. అనిల్ పోయిన కొన్నాళ్ళకే, బెంగతో మంచంపట్టిన అమ్మకూడా కన్నుమూసింది"- అంది భారంగా.

నిజంగా ఎంత ట్రాజెడీ ?.. గుండెల్ని పిండిచేసే ఆ సంఘటన వింటేనే అంత భయంకరంగా వుంటే, శ్రీనివాసరావుగారి పరిస్థితి మరెంత హృదయవిదారకంగా వుంటుందో అనుకున్నాడు శేఖరం, ఆయనతో అడవికి వెళ్ళాలనుకున్న 'ప్రోగ్రాం' మానేయటమే మంచిదని నిశ్చయించుకున్నారు.

బోట్ హౌస్‌లోంచి అందరూ తిరిగిహాల్లోకివచ్చేసరికి ఎనిమిది గంటలయింది. శ్రీనివాసరావుగారు సోఫాలో వెనక్కి జారగిలపడి రెండుచేతులూ తలవెనక్కి పెట్టుకుని - కళ్ళుమూసుకుని - యోగనిద్రలో వున్నట్టుగా కూర్చునివున్నారు.

"మీరింకా ఇక్కడేకూర్చున్నారే!"అన్నాడు శేఖరం, ప్రక్కనే వున్నమరో సోఫాలోకూర్చుంటూ.... నరేషూ, నీరజా కూడా కూర్చున్నారు. రాజయ్య లోపలకు వెళ్ళిపోయాడు.

"మీ కోసమే చూస్తున్నాను. భోజనం చేద్దాం లేవండి"- అన్నారు శ్రీనివాసరావుగారు.... ఆయన మాటకు ఎదురు చెప్పి ప్రయోజనం వుండదు. ఆ విషయం శేఖరానికి బాగా తెలుసు.... అందుకే మొహమాటం అడ్డువస్తున్నా భోజనానికి లేవక తప్పింది కాదు.

"ఇంతకీ మనం అడవికి ఎప్పుడు వెళదాం?... వచ్చే ఆదివారం మీకు వీలవుతుందా?"-భోజనం చేస్తూంటే అడిగారు ఆయన.

శేఖరం, నరేష్— ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఇప్పుడిప్పుడే మానసికంగా ఆయన కోలుకుంటున్నారు. మళ్ళీ అడవికి వెడితే, పాత జ్ఞాపకాలు ఆయనకు మనోవేదన కలిగించవచ్చు.... మరణించిన అనిల్ తాలూకు గతస్మృతులు - ఆయనకు మానసిక వికారాలను కలిగించవచ్చు.... అందుకే శేఖరం అన్నాడు.

"ఈసారి ఎప్పుడైనా వెళదాం లెండి!.... వచ్చే ఆదివారం నాకు వేరే పని వుంది" అని.

"అయినా ఈ వయసులో- మీకు ఇంకా తాపత్రయాలు ఎందుకు సార్?" వంత పలికాడు నరేష్.

"మరేంలేదోయ్! అడవిలో కొన్ని ఎకరాలయినా, చదును చేయిస్తే వ్యవసాయానికి వీలవుతుంది. దానివల్ల మరో పది మందికి ఉపాధి కల్పించిన వాళ్ళమవుతాం కదా!"—

"అదిమాత్రం నిజం సార్! అందుకే ఓ పని చేయండి! త్వరగా నీరజగారికి ఓ మొగుడ్ని వెతకండి! ఎలాగో పుట్టేవుంటాడు కదా ఎక్కడో?....ఆయనగారు వచ్చింతరువాత_ఆ బాధ్యత కాస్తా వప్పగించండి!"_అన్నాడు నరేష్ నవ్వుతూ.

"అదీ పాయింటే" అన్నాడు శేఖరం.

"ఈ పాయింటు నాకూ నచ్చిందోయ్"- భుజాలెగరేశారు శ్రీనివాసరావుగారు.

"మీకు మీ పాయింట్లకూ ఓ నమస్కారం కానీ - ముందు భోజనం సరిగ్గా చేయండి. కబుర్లతో కడుపు నిండదు"_అంటూ కోపంగా చూసింది నీరజ-శేఖరం నరేష్‌లవైపు!.

శ్రీనివాసరావుగారు నిండుగా నవ్వుకున్నారు.

* * * *

నరేష్ ఈ మధ్య చాలా రోజులనుంచీ _ తరచుగా ఏదో ఆలోచిస్తున్నట్లు పరధ్యానంగా కనిపిస్తున్నాడు. తన దగ్గర ఏదో చెప్పటానికి సంశయిస్తున్నాడేమో అన్నట్లుంటున్నాయి అతని చూపులూ, మాటలూ.

ఏమైనా, ఆ విషయం ఏమిటో తేల్చుకోవాలని నిశ్చయించు కున్నాడు శేఖరం.... ఎంతో అడిగిన మీదట నరేష్ తన మనసులో వున్న సంగతి బయటపెట్టాడు.

"ఆ మధ్య సీతానగరం వెళ్ళినప్పుడు హారితను చూశాను.... ఆ క్షణంనుంచి నా మనసు చెదిరిపోయింది....మీ అందరికీ ఇష్టమైతే హారితను నేను పెళ్ళిచేసుకుంటాను...." నరేష్‌మాటల్లో దృఢ నిశ్చయం వినిపించింది.

శేఖరం ఆనందానికి అవధులులేవు. నిజంగా హారిత అదృష్ట వంతురాలనుకున్నాడు.... రామ్మూర్తిగారి మంచితనమే ఆయనకు చక్కనిమార్గం చూపిస్తోంది.... ఆరోజే _ ఆ విషయం వివరిస్తూ

రామ్మూర్తిగారికి ఉత్తరంరాశాడు శేఖరం—మూడోరోజుకి ఆయన దగ్గరనుంచి జవాబువచ్చింది....'అంతకంటే తమను ఆనందపరిచే సంఘటన తమ జీవితంలో మరి రాదని రాశారు ఆయన.

మాఘమాసంలో - పెళ్ళి జరిగిపోయింది.... నూతన వధూవరులిద్దరూ శేఖరానికి నమస్కరించినపుడు, శేఖరంకంట్లో నీరు తిరిగింది..

కలకాలం పసుపు కుంకుమలతో సౌభాగ్యవతిగా వుండాలమ్మా"- అనిలేవదీసి, హరితను తనహృదయానికి హత్తుకున్నాడు. చిన్నప్పటినుంచీ, శేఖరాన్ని అన్నకంటే మిన్నగా ప్రేమించింది హరిత.... కానీ అప్పుడప్పుడు శేఖరం ప్రవర్తనా, చూపులూ, ఆమెను కలవరపెట్టేవి....తన అనుమానం నిజంకాకూడదని వేయి దేవుళ్ళకు మొక్కుకుంది.... తన ప్రార్థనలు వృథాపోలేదు. దేవుళ్ళందరూ తనను కరుణించారు. ఇపుడు శేఖరం తనకునిజమైన సోదరుడు.

బాధ్యతలన్నీ తీరిపోయాయికనుక, రామ్మూర్తిగార్ని తనతో హైదరాబాద్ వచ్చేయమని కోరాడు శేఖరం.... మరి కొంతకాలం వరకూ సీతానగరం వదిలిరాలేననీ, ఆరోజువచ్చినపుడు తప్పకుండా వచ్చి శేఖరంతోటేవుంటామనీమాటఇచ్చారు. హరిత అత్తవారింటికి వెళ్ళిపోయింది.

శేఖరం, నరేష్ హైదరాబాద్ తిరిగివచ్చారు.... శ్రీనివాసరావుగారిని గురించిన వార్త వినగానే ఇద్దరూ కృంగిపోయారు.... ఇరవైరోజుల వ్యవధిలో పరిస్థితులు ఎంత దారుణంగా మారిపోయాయి?.... ఆ సాయంత్రమే ఇద్దరూ శ్రీనివాసరావుగారింటికి పరుగెత్తారు.

వాళ్ళను చూడగానే, అపరాధంచేసిన మనిషిలా, తలవంచుకుని తనగదిలోకి వెళ్ళిపోయింది నీరజ.... ఇద్దరూ మేడమీది గదిలోకి వెళ్ళారు.

శ్రీనివాసరావుగారు తమ తైలవర్ణచిత్రాన్ని తదేకంగా చూస్తూ- దాని ఎదురుగా నిలబడివున్నారు.... అలికిడయి, వెనక్కి తిరిగిచూసి, వాళ్ళను ఆప్యాయంగా ఆహ్వానించారు.... ముగ్గురూ సోఫాల్లో కూర్చున్నారు.

"మేం విన్నది నిజమేనా ?"-అడిగాడు శేఖరం ఆందోళనగ

శ్రీనివాసరావుగారు బరువుగా నిట్టూర్చారు... ఆయన ఎంతో తేలిగ్గా, బరువు తగ్గిపోయినట్లు కనిపించారు.

శ్రీనివాసరావుగారు యిప్పుడు అనుభవిస్తున్న ఆస్తి ఆయన స్వార్జితం కానీ, పిత్రార్జితం కానీ కాదు.... ఎవరో బంధువుద్వారా సంక్రమించిన యావదాస్తినీ - ఇంతకాలంగా అనుభవిస్తూవచ్చారు. కానీ ఇప్పుడు అసలు వారసుడు విదేశాలనుంచి తిరిగివచ్చి కోర్టు ద్వారా తన హక్కును సంపాదించుకున్నాడు.... అంతులేని సంపదను ఇంతకాలం కాపాడటమే కాకుండా, మరింత వృద్ధిపరచినందుకు ప్రతిఫలంగా హిమయత్‌నగర్‌లోని ఇల్లు శ్రీనివాసరావుగారికి ఇచ్చాడు....మరో పాతికవేల రూపాయలుకూడా నీరజపెళ్ళికోసం ఇచ్చాడు .. ఆ మర్నాడే - బంగళా ఖాళీచేస్తున్నారు.

"అందుకే ఓడలు బళ్ళు అవుతాయంటారు కాబోలు" అనుకున్నారు శేఖరం, నరేష్.

సంపదంతా క్షణంలో హరించుకపోయినా నిబ్బరంగానే వున్నారు శ్రీనివాసరావుగారు. ఆయనకు ఆ వయసులో, నీరజను గురించిన బెంగ ఎక్కువయింది. ఆ మధ్యెప్పుడో వివాహ ప్రయత్నాలు చేసినా, అనుకున్నవిధంగా సంబంధాలు నచ్చకపోవటం వల్ల వదులుకున్నారు.... కానీ, ఇప్పుడు ఆవిషయం ఆలోచించే సమయంకూడా దాటిపోయింది.

తన జీవితంలో పెళ్ళిప్రస్తావన తీసుకరావద్దని తండ్రికి ఖచ్చితంగా చెప్పేసింది నీరజ.... ఆ సమస్యను కాలమే తీరుస్తుందని సమాధానం చెప్పుకున్నాడు శ్రీనివాసరావుగారు.

"చూశావా శేఖరం ! మనిషిని పరిస్థితులు ఎంతగా లొంగదీసుకుంటాయో చూశావా ?...." - కొన్నిక్షణాల నిశ్శబ్దం తరువాత శ్రీనివాసరావుగారన్నారు.

"మీ రనవసరంగా దిగులుపడకండి ! అయినా మీకిప్పుడు వచ్చిన లోటేముంది చెప్పండి ?...." - ఏదో ఊరట కలిగించాలనే ఉద్దేశ్యంతో అన్నాడు నరేష్.

"కట్టెలమ్మినచోట పూవులమ్ముకోవటమయితే ఫరవాలేదోయ్.... కానీ ఇప్పుడు పూవులమ్మినచోటనే కట్టెలమ్ముకోవాల్సిన

పరిస్థితి వచ్చింది.... కష్టపడేవాడికి సుఖపడటం అంటే బాగానే వుంటుంది.... కానీ, సుఖపడినవాడికి ఇకముందు కష్టపడాలంటే బాధగానే వుంటుంది" - శ్రీనివాసరావుగారి మాటలు బరువుగా వున్నాయి.

ఆ తరువాత మరికొన్ని నిముషాలు ఎవరూమాట్లాడుకోలేదు. రాజయ్య కంటనీరు పెట్టుకుంటూనే, కాఫీలు అందించాడు.... అందరి కళ్ళల్లోనూ కన్నీరునిలిచింది.... ఆయింటితో ఋణం తీరిపోతోందనే బాధ అందరి గుండెల్నీ పిండుతోంది.

"తరచు వస్తూండండిబాబూ! ఇక నాకు అంతా తీరికే!"- తాము వెడుతున్న కొత్తఇంటి అడ్రస్‌వున్న కాగితం శేఖరానికి అందిస్తూ- నిర్లిప్తంగా అన్నారు శ్రీనివాసరావుగారు.... ఆయన దగ్గర ఇద్దరూ శలవు తీసుకొని బయల్దేరారు.... శేఖరం, నీరజగది వద్ద క్షణం ఆగి, ముందుకు నడిచాడు.... నరేష్‌మాత్రం గదిలోకి ఓ అడుగువేసి-

"వస్తాం నీరజగారూ! మీ నాన్నగార్ని కాస్త జాగ్రత్తగా చూసుకోండి!.... మీకు చెప్పవలసినవాళ్ళం కాదు..... ఇలాంటి సమయాల్లోనే ధైర్యం కూడగట్టుకోవాలి!.... మీరు కొత్తయింటికి మారింతర్వాత వచ్చికలుసుకుంటాం"- అని ఆమె సమాధానానికి ఎదురుచూడకుండానే, శేఖరాన్ని కలుసుకున్నాడు.

వెళ్ళిపోతూ, వెనక్కి తిరిగి చూసాడు .. ఆ మహల్ వారిద్దరికీ వీడుకోలు చెపుతున్నట్లుగా అనిపించింది ... అందరికీ ఆ భవంతితో ఋణంతీరిపోయింది.... భవంతిముందు ఆ గార్డెన్‌లో కూర్చొని ఎన్నో అందమైన సాయంకాలాలు గడిపారు.... ఎన్నో కథలూ- కబుర్లూ రోజులతరబడిచెప్పుకున్నారు.... అవన్నీఇప్పుడు కలల్లా కరిగిపోతున్నాయి.... మిగిలేవి ఇక జ్ఞాపకాలుమాత్రమే!!

## 4

కాలగర్భంలో రెండేళ్ళు కలసిపోయాయి.

శేఖరం పనిచేస్తున్న బ్యాంకులోనే నీరజకూడా ఉద్యోగం సంపాదించుకుంది.... శ్రీనివాసరావుగారింటికి శేఖరం తరచుగా

వెడుతూనే వున్నాడు.... హరిత. నరేష్‌లు వేరే ఇల్లు తీసుకొని-కాపురం పెట్టారు.

శ్రీనివాసరావుగారు కొత్తజీవితానికి తొందరగానే అలవాటయారుకానీ, నీరజ ప్రవర్తనే ఒకోసారి వింతగా వుండేది.

హిమాయత్‌నగర్‌లో శ్రీనివాసరావుగారుంటున్న ఇల్లు చిన్నదేఅయినా, అన్ని సదుపాయాలతో ఆధునికంగా వుంది.... టెలిఫోనుకూడా వుంది. చిన్నామాత్రం ఆ కొత్తయింటికి అలవాటు పడలేకపోయింది. ప్రతిచోటునీ వాసనచూస్తూ ఇల్లంతాతిరుగుతోంది. క్రమంగాతిండితినటంకూడామానేసింది...వెటర్నరీడాక్టరుకు చూపిస్తే ఏవో ఇంజక్షన్లు చేశారు. అది పాత యింటిమీదా, రాజయ్యమీదా బెంగపెట్టుకుని క్రమ క్రమంగా క్షీణించిపోతోంది. ఒకరోజు నీడ నుంచి వెలుగులోకి రావటానికి ఎంతో మొరాయించింది. సోఫా క్రిందనుంచి బయటకు రానేలేదు. ఆ విషయం విన్న డాక్టర్ ఖచ్చితంగా చెప్పేశాడు. కొద్దిరోజుల్లో దానికి పిచ్చిరావటం ఖాయం. అప్పుడది ఎవరిని కరిస్తే వారికి పిచ్చి ఎక్కుతుంది. అందుకని బలవంతంగానైనా దాన్ని చంపటం అవసరం అని చెప్పాడు. అది విని నీరజ ఎంతగానో విలపించింది. శ్రీనివాసరావుగారికి మరింత వేదాంత ధోరణి అలవడింది, అన్నింటితోబాటూ ఒదీ ఋణం తీర్చేసుకుని వెళ్ళిపోతోందని.

చిన్నా చనిపోయినా దాని జ్ఞాపకాలు వారిని వదిలిపెట్టలేదు .... అది సింహంలా బ్రతికింది. చీమ చిటుక్కుమంటే గుర్రుమంటూ లేచేది.... ఎవర్నీ లోపలకురానిచ్చేదికాదు.... అదిమొరిగిందంటే, ఎదుటివారి గుండెలవిసిపోయేవి కట్టేసివున్నా, దాన్ని చూడగానే భయపడేవారు కొత్తవాళ్లు.... ఒక మనిషిపోతే ఆ యిల్లు ఎలా వుంటుందో-చిన్నా చనిపోయినా అలాగే అయింది.

అదే సమయంలో బ్యాంకులో వాళ్ళంతా కలసి నాగార్జున సాగర్ విహారయాత్రను ఏర్పాటు చేశారు. అలాంటి ప్రదేశానికి స్నేహితులతో వెడితే, గుండెల్లో బరువంతా దిగిపోయి, మనసుకి కాస్తంతా ఊరట కలుగుతుందని, శ్రీనివాసరావుగారే బలవంత పెట్టి, నీరజనుకూడా విహారయాత్రకు పంపించారు. అక్కడ

గడిపిన రెండు రోజుల్లోనూ నీరజ శేఖరానికి చాలా సన్నిహితు రాలయింది.

నాగార్జునుని కొండవద్దకు వెళ్ళటానికి అందరూ లాంచి ఎక్కారు.... నేల మీదనుంచి లాంచిలోకి వేసిన బల్లమీద సరిగా నడవలేకపోయింది నీరజ.... తనచేయి అందించి నీరజను లాంచి లోకి తీసుకెళ్ళాడు శేఖరం.... ఒకరిచేయి ఒకరుపట్టుకున్న క్షణం ఇద్దరి హృదయాలూ స్పందించాయి. వేయి మల్లెలు విరిసాయి. కోటివీణలు మ్రోగాయి.... ఆ ప్రయాణం వారిద్దరి మధ్యావున్న అడ్డుగోడల్ని తొలగించింది. కృష్ణ ఒడ్డున కూర్చుని ఇద్దరూ మనసు విప్పి ఎన్నో సాహితీ విషయాలు మాట్లాడుకున్నారు.

"ఒకటి రెండు పత్రికల్లో ఆ మధ్య మీ కథలు చదివాను. మరి మళ్ళీ రాయటంలేదా?"- అడిగింది నీరజ.

"నా వృత్తి కథలు రాయటం కాదుగా!.... కథ రాయటాని కైనా-పాట పాడటానికైనా ఓ రకమైన ఆవేశం కావాలి!"— దూరంగావున్న ప్రకృతిలోకి చూస్తూ అన్నాడు శేఖరం.

"అయితే మీరు పాటలు పాడగలరు కూడానా?" నీరజ అడిగింది.

"ప్రావీణ్యత లేదుకానీ-ప్రవేశం వుంది! పైగా ఎవరికోసమో పాడమంటే నేను పాడలేను!" నేనెప్పుడూ నా కోసమే పాడు కుంటాను. నా మనస్సు పరవశించినప్పుడు పాడుకుంటాను. అలాగే మనసు బాగాలేనప్పుడూ పాడుకుంటాను" - అన్నాడు.

శేఖరంచేత బలవంతంగా పాటలు పాడించుకుని - వింటూ తన్మయంతో పరవశించిపోయింది నీరజ.... శేఖరంలో గంభీరతనే ఇన్నాళ్ళూ మెచ్చుకునే నీరజ అతనిలోని కళాహృదయాన్ని అభి నందించకుండా ఉండలేకపోయింది.... ఆ విహారయాత్ర ఆమెలోని ఆశలకు కొత్తఊపిరిపోసింది.

ప్రతిరోజూ 'లంచ్‌టైం'లో ఇద్దరూ కలుసుకుంటూండే వారు....అదే సమయానికి. నారాయణకూడా వెళ్ళేవాడు.... శేఖరానికి నారాయణకూడా మంచిస్నేహితుడు .... 'లంచ్‌టైం'లో - టిఫిన్ తీసుకుంటూ ముగ్గురూ ఎన్నోవిషయాలు మాట్లాడుకునేవారు.... కానీ, నాగార్జునసాగర్‌నుంచి వచ్చినప్పటినుంచీ, 'లంచ్ టైం'లో

నారాయణ రావటం నీరజకు ఇష్టం ఉండటంలేదు.... 'తా మిద్దరి మధ్యా నారాయణ ఎందుకూ ?' అనుకునేది ..

ఆరోజు ఆఫీసులో ఎవరికో 'సెండాఫ్' పార్టీ యిస్తున్నారు. అదిపూర్తయి ఇంటికి బయల్దేరేటప్పటికి ఆరుగంటలు కావస్తోంది.... "పోనీ పిక్చర్ ఏదైనా చూద్దామా ?" - అని అడిగాడు శేఖరం.... నీరజ మనసు ఎగిరి గంతేసింది.

ఇద్దరూ హాలులో కూర్చున్నారు. సినిమా మొదలయింది. నీరజకు అది తొలి అనుభవం.... ఇదివరకు ఎన్నోసార్లు, నరేష్, శేఖరం, తనూ శ్రీనివాసరావుగారూ కలసి వెళ్ళేవారు. కొన్నిసార్లు ఏ ముగ్గురో కలసి వెళ్ళేవారు. కానీ, తను ఇలా శేఖర్‌తో ఒంటరిగా వెళ్ళటం అదే మొదటిసారి. ఏదో విద్యుత్ శరీరమంతా వ్యాపిస్తోంది.... శేఖరంమాత్రం చాలా శ్రద్ధగా పిక్చర్ చూస్తున్నాడు. నీరజ మనసు సినిమామీద లగ్నం కావటంలేదు. కథ ఏమిటో, ఏం జరుగుతోందో కూడా అర్థంకావటంలేదు.... శేఖరం మరికాస్త తనను ఆనుకుని కూర్చుంటే బాగుండుననిపిస్తోంది....కానీ అతను ఒక్క అంగుళమైనా కదలకుండా జాగ్రత్తగా ఓ ప్రక్కకు ఒరిగి కూర్చున్నాడు. చాలా సేపు ఓర్పు వహించింది.... రానురాను ఓర్పు కాస్తా సన్నగిల్లి, దాని స్థానంలో - అతనిపై కోపం చోటుచేసుకుంది.... అక్కడే 'ఏదోలా' ప్రవర్తించాలని కాదుకానీ, కాస్తంత ఆనుకుని కూర్చుంటే ఏం మునిగిపోతుంది ?.... నీరజలోని వేడి రక్తం - అతని ప్రవర్తనతో చల్లబడిపోయింది.

సినిమా అయిపోయింది.... దార్లో నీరజ ఏమీ మాట్లాడ లేదు.... 'మౌనంగా వున్నావెందుక'ని శేఖరమూ అడగలేదు. నీరజను ఇంటివద్దర దిగబెట్టి, అదే ఆటోలో తనయింటికి వెళ్ళిపోయాడు శేఖరం.... ఆటోలో ఉయినా, తనను ఆనుకుని, దగ్గరగా కూర్చుంటాడని ఆశపడిన నీరజకు నిరాశఎదురయింది.... మాటిమాటికీ, నాగార్జునసాగర్‌లో శేఖర్‌తో గడిపిన క్షణాలూ. అతను పాడినపాటలూ జ్ఞాపకంవచ్చి- 'ఆ శేఖరమేనా ఈ శేఖరం ?" అనుకుని ఆశ్చర్యపోయింది.

ఒకరోజు చాలాజ్వరంతో ఇంటికి వచ్చింది నీరజ.... ఆ జ్వరం పదిరోజులదాకా ఆమెను వదిలిపెట్టలేదు.... ఈలోగా

ఎదురోజులకొకసారైనా శేఖర్ వస్తూనేవున్నాడు.... అంతజ్వరం లోనూ- కళ్ళుకాయలుకాచేలా ఎదురుచూసే నీరజ, అతనురాగానే నబాధనంతా మరచిపోయేది.... ఆమెమనసుకు ఊరటకలిగేది....

కానీ అది ఎంతోసేపు నిలిచేదికాదు.

శేఖరం రాగానే- 'ఎలావుంది నీరజా'- అని పొడిపొడిగా అడిగి ప్రక్కనున్న కుర్చీలోకూర్చుని- స్టూల్‌మీదనున్న ఏపేపరో పుస్తకమో తీసుకొని శ్రద్ధగా చదువుకునేవాడు.... తన ప్రక్కన అతనుకూర్చోవాలనీ, కాలిపోతున్న తన నుదుటిమీద చల్లనిచేత్తో ఆప్యాయంగా స్పృశించాలనీ ఆమె కోరుకునేది.... కానీ అలాంటి ఊహాలు శేఖర్‌కి కలిగేవికావు.

అతను 'వాచ్' చూసుకోగానే ఆమెకు గుండె ఆగినంత పనయ్యేది... వెళ్ళేముందు అతనలా 'టైం' చూసుకున్నాడంటే ఇక అతన్ని ఆపటం ఎవరితరమూ కాదని నీరజకుతెలుసు,

ఒక్కొక్కసారి- వాళ్ళగార్డెన్‌లోకూర్చుని అందరూ కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు - మంచి 'టాపిక్' చర్చించుకుంటున్నా - చటుక్కున టైం చూసుకుని- తక్షణం లేచేవాడు.... 'కూర్చోవోయ్ వెడుదువుగాని' అని శ్రీనివాసరావుగారన్నా- మరుక్షణం ముళ్ళ మీద కూర్చున్నట్టు కూర్చుని లేచిపోయేవాడు.

అది తలచుకొని నిట్టూర్చేది నీరజ.... శేఖర్ వెళ్ళి పోతూంటే దీనంగా అతని కళ్ళలోకిచూస్తూ- "రేపు తొందరగా వస్తారుగా"- అని తాను అడగటం, తప్పకుండా వస్తానని అతను చెప్పటం- యథాప్రకారం మళ్ళీ మర్నాడు అతను ఆలస్యంగా రావటం- క్రమంగా నీరజకు అలవాటయిపోయింది.... 'తన పరిస్థితి శేఖర్‌కి వస్తే అప్పుడు తెలుస్తుంది'- అనికూడా అనుకునేది. 'ఎదురుచూడటంలో వుండేబాధ ఎలా వుంటుందో అతనికి తెలియ చెప్పాలి ఎప్పటికైనా'- అనుకుంది నీరజ....

నీరజకు జ్వరంతగ్గింది .... ఆ రోజున మళ్ళీ ఆఫీసులో అడుగుపెట్టగానే సంతోషంగా పలకరించాడు శేఖరం....ఆక్షణంలో అతన్నీ అతని ఆనందాన్నీ చూడగానే ఆమె మనసులోని గ్లానీ- వేదనా విడిపోయి - ఎంతో హాయిగా మనసు దూదిపింజలా తేలి పోయింది.

ఒకరోజు నారాయణ శేఖర్‌తో సీరియస్‌గా అన్నాడు

"చూడు శేఖర్!....మీరిద్దరూ ఇంత చనువుగా తిరగటం ఆఫీసులో చాలా మందికి మేత దొరికినట్టుగా వుంది. ఉద్దేశ్యం వుంటే త్వరగా పెళ్ళిచేసుకోండి"- అని సమాధానంగా చిన్న నవ్వు నవ్వేశాడు శేఖరం. అదేరోజున హరిత ఇంటికి వెడితే ఆమెకూడా అదే ప్రస్తావన తెచ్చింది. "త్వరగా నీరజను పెళ్ళి చేసుకొని- వదినగారు లేనిలోటు తనకు తీర్చమంది. అది విని నరేష్ నవ్వేశాడు. శేఖరం తనలా తొందరపడే మనిషికాదని హాస్యం చేశాడు. అప్పుడుకూడా శేఖరం సన్నగా నవ్వి వూరుకున్నాడే తప్ప సమాధానం చెప్పలేదు.

హరిత కళ్ళల్లో నీరు తిరిగింది....

"శేఖర్! పెళ్ళి చేసుకోవటానికి ఎందుకిలా ఆలస్యం చేస్తున్నావ్? ఇవాళ ఏమైనాసరే, నువ్ చెప్పి తీరాల్సిందే, లేకపోతే నా మీద ఒట్టు"—

ఆమె మాటలకు శేఖరం ఉలిక్కిపడ్డాడు. ఆ విషయాన్ని అంత సీరియస్‌గా హరిత తీసుకుంటుందని అతను అనుకోలేదు. ఇక చెప్పక తప్పలేదు.

"చేసుకుంటానమ్మా! కానీ.... రావలసిన ప్రమోషన్‌కోసం కొంత కాలంగా ఆగాను. అది త్వరలోనే రాబోతోంది. ఇక అప్పుడు మీరు ఆగమన్నా ఆగను! తెలిసిందా నరేష్‌గారూ?"—

మనసు తేలికపడింది వారికి. ఆ రాత్రి వాళ్ళింట్లోనే భోజనం చేసి ఇంటికి చేరుకున్నాడు శేఖరం.

* * * *

ఆ రాత్రి భోజనాలయినతరువాత, శ్రీనివాసరావుగారు నీరజను తనదగ్గరకు పిలిచారు.

"నీకు త్వరగా పెళ్ళిచేసేస్తే నాబాధ్యత తీరిపోతుందమ్మా ఏమీ తోచటంలేదని నువ్వు పదేపదే అంటూంటే-పాత విషయాల్ని మరపించటంకోసమైనా, నిన్ను ఉద్యోగంలో చేర్పించటం మంచిదని తోచి ఇన్నాళ్ళూ నిన్ను ఉద్యోగానికి పంపుతున్నాను కానీ ఇలా ఎంతకాలం తల్లీ?.... నీ మనసులో ఎవరైనా వుంటే చెప్పమ్మా! నాకు ఎలాంటి అభ్యంతరమూ వుండదు. ఆ.... అన్నట్టు

ఆఫీసులో సెక్షన్ ఆఫీసర్ మురళీకృష్ణట ...అతను రాజారాంతో ...బురు చేశాడు. మనకు ఇష్టమైతే–నిన్ను చేసుకుంటానన్నాడు"– ...ప్పటం ఆపి, కూతురివైపు చూశారు శ్రీనివాసరావుగారు.

"చూద్దాంలే నాన్నా!.... అప్పుడే తొందరేమొచ్చింది?" అంటూ అక్కడనుంచి లేచి తనగదిలోకి వెళ్ళిపోయింది నీరజ.

ఆరాత్రి చాలాసేపు కిటికీలోంచి–నిశీధిని చూస్తూ గడిపింది.

మర్నాడు ఆఫీసులో శేఖరం – నీరజా కలుసుకున్నప్పుడు చూపుల్లో ఏదో కొత్తదనం ఉందేమిటీ!'అని ఎవరికివారే – ఒకరిని గురించి మరొకరుమనసులో ఒకేసారి అనుకున్నారు..."సాయంత్రం ఇంటికి ఓసారి రండి.... తప్పకుండారావాలి" – అని నీరజ తన సెక్షన్‌లోకి వెళ్ళిపోయింది.

కానీ లంచ్‌టైంలో ఓ అనుకోని సంఘటన జరిగింది. ...రాయణా, శేఖరం, నీరజా టిఫిన్ తీసుకుంటున్నారు. సరిగ్గా అదేసమయంలో మరోసెక్షన్‌లో పనిచేస్తున్న రేవతి అక్కడకు వచ్చింది. తమ ఆఫీసులో ఏవైనా సాంస్కృతిక కార్యక్రమాలు జరిగేటప్పుడు కవిత్వం రాసి చదువుతూంటుంది.

శేఖర్‌కూడా రచనావ్యాసంగంలో అంతో ఇంతో కుతూహలం వున్నదని తెలుసుకున్నతర్వాత అప్పుడప్పుడు తను రాసిన ...వితలగురించీ, కథలగురించీ – అభిప్రాయం తెలుసుకోవటానికి రేవతి శేఖర్‌దగ్గరకు అలా వస్తూంటుంది.

సరిగ్గా అప్పుడుకూడా – అందుకే వచ్చింది రేవతి.

"కొత్తరకంగా కవిత రాశాను శేఖరంగారూ! మీరు ...సి ఓ కే చేస్తే ఈసారి పత్రికకు పంపిద్దామనుకుంటున్నాను"– అంటూ తనురాసిన కవితను శేఖరానికి అందించింది.... అప్పటికి ...ఫిన్ తినటం పూర్తయిన శేఖరం – ఆ కవితను చదివాడు.

"చాలాబాగుంది! మీరు 'ఎటెంప్ట్' చేసిన పద్ధతి చాలా ...గుంది.... మీరు త్వరలో మంచికవయిత్రయిపోతారు". అన్నాడు ...ఖరం, చదివిన తర్వాత కవితను ఆమెకు తిరిగి ఇచ్చేస్తూ

'అంతా మీ ప్రోత్సాహం!"– అంటూ–కృతజ్ఞతగా చూసిందిరేవతి.

అంతవరకూ బల్లమీదవున్న కాగితాలను చూస్తూ కూర్చున్న ...రజ హఠాత్తుగా లేచి "మరి నేను వస్తాను"– అంది.

"ఫ్లాస్కులో కాఫీ అలాగే వుంది, మీరు వెళ్ళిపోతే ఎలా
అన్నాడు నారాయణ

"ఇప్పుడు తాగాలనిలేదు" - అని ముక్తసరిగా సమాధాన
చెప్పి - ఛివాల్న లేచి వెళ్ళిపోయింది నీరజ. ఏమీ జరగనట్టు
చిన్నగా నవ్వి ఊరుకున్నాడు శేఖరం. ఆతరువాత కొన్నినిముష
లకు పత్రిక అడ్రస్ తీసుకుని, శేఖరానికి కృతజ్ఞతలు చెప్పి
రేవతికూడా తన సెక్షన్‌కి వెళ్ళిపోయింది.

నీరజ ఆవేశం శేఖరానికి కొత్తకాదు.... ఇలా అనేకసార్లు
ఆమె అలిగివెళ్ళి పోవటమూ మామూలే. శేఖరం అలా చూస్తూ
వూరుకుంటాడు!.... కానీ.... అప్పుడప్పుడు అనుకుంటాడు.

నీరజ ఎందుకలా ప్రవర్తిస్తుంది?.... తాను నీరజను ఎంత
గానో ప్రేమిస్తున్నాడు.... ఆమెమనసునుకష్టపెట్టాలని తానెప్పుడూ
అనుకోడు.... నీరజంటే తనకుప్రేమేకాదు.... గౌరవమూవుంది...
ఆ విషయం నీరజకూ తెలుసు!... కానీ అప్పుడప్పుడు- ఎందుకో
విపరీతార్థాలు తీసుకుని ఆవేశంగానూ, కోపంగానూ మాట్లాడుతుంది

ఒకరోజు గడిస్తే ఆవేశం చల్లార్చుకొని తనేముందు పలక
రిస్తుంది నీరజ.... నిజమేమరి!.... శేఖరం ఆమెపట్ల నిర్దయగ
కానీ, నిర్లక్ష్యంగాగాని ప్రవర్తిస్తేకదా?.... అందుకే అలక
తీరినతర్వాత ఆమె తన సీటువద్దకువచ్చి- మళ్ళీ పలకరించినప్పుడ
శేఖరంహృదయం ఆనందంతో నిండిపోతుంది.... నిజానికి త
కోసం పరితపించే స్త్రీని పురుషుడు ఎంతగానో ఆరాధిస్తాడు.

అయితే తాను ఆమెను ఆరాధిస్తున్నాడని, ప్రతినిముష
ఆమెకు గుర్తుచేయాలా?.... ఒకవేళ నీరజ అలా అనుకోవట
లేదుకదా?... ఆ విషయం గురించే ఎన్నోసార్లు ఆలోచిం
ఇదమిద్ధంగా ఓ నిర్ణయానికి రాలేకపోయేవాడు శేఖరం.

అతని ప్రవర్తనను ఎన్నోసార్లు అపార్థం చేసుకునే
నీరజ.... తనంటే అతనికి నిర్లక్ష్యమనీ అతనికసలుహృదయమే
లేదనీ ప్రతిసారీ అనుకునేది.

'కోపంవచ్చినప్పుడు కారణం తెలుసుకుని ఓదార్చవలసి
అవసరం అతనికి వుందనుకోలేదా' అని నీరజ అనుకుంటుంది.

'అసలు కోపంరావలసిన అవసరమేమిటీ ?'- అని శేఖరం
 లోచిస్తాడు.

ఆ సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికివచ్చాక, శేఖరంకోసం
ఎలా సేపు ఎదురుచూసింది నీరజ.... సాధారణంగా, ఆఫీసునుండి
న యింటికివెళ్ళి- స్నానంచేసి బట్టలు మార్చుకొని వస్తాడు....
నీ ఇక వచ్చేసమయం దాటిపోయింది.... 'ఇక శేఖరం రాడు'
నుకుంది నీరజ.... అయినా అనుకున్న సమయానికి ఎప్పుడు
చ్చాడుకనుక ? అలా ఆలస్యంగా రావటం అతని కలవాటు....
ముషాలు లెఖ్ఖపెట్టుకుంటూ అసహనంతోబాటు కోపాన్ని పెంచు
వటం నీరజకలవాటు.

ఇక ఎదురుచూసే ఓపిక క్షీణించి ఆఖరికి తనకు స్పృహ
ప్పుతుందేమో అన్న స్థితిలో శేఖరం వచ్చాడు.... వస్తూనే -

"సారీ నీరజా ! కొంచెం ఆలశ్యమయింది"- అంటూకుర్చీలో
ూర్చుంటూనే పక్కన టీ పాయ్‌మీదనున్న పేపరు తీసి అందులో
ల దూర్చేశాడు శేఖరం.

"కొంచెమట....కొంచెం! "కోపంలో నీరజకు ఒళ్ళు మండి
తోంది. అయినా నిగ్రహించుకుని మౌనంగా వుండిపోయింది.

పేపర్‌లోంచి-రెండు నిముషాలతర్వాత బయటపడి-నీరజ
పు చూశాడు. అతని చూపులు క్షణకాలం ఆమెపై అలాగే నిలిచి
యాయి. అలా శేఖరం తనను ఎందుకు చూశాడో నీరజకు
లుసు. అతనికి ఇష్టమైన నీలంరంగు చీర కట్టుకుంది.

అతని చూపులనుంచి తప్పించుకోలేక సిగ్గుతో చిన్నగా
వ్వింది నీరజ. శేఖర్‌కూడా నవ్వేశాడు. ఆ నవ్వును చూడగానే
ధ్యాహ్నం అలిగిన సంగతికూడా మరిచిపోయింది. వేయిమల్లెలు
కేసారి విరిసినట్టు ఎంతో మనోహరంగా నవ్వుతాడు శేఖరం....
ందమైన పలువరుస.... ఎర్రని పెదవులు—— నవ్వినపుడు నగం
ూసుకునేకళ్ళు....ఆ నవ్వుచూస్తేచాలు తాను పరవశించిపోతుంది.
లాంటప్పుడు కోపంకాస్తా మాయమై ఎన్నో సంగతులు మాట్లాడే
స్తుంది. అతనుమాత్రం గంభీరంగానే వుండిపోతాడు. అలాం
ప్పుడు మళ్ళీ అనిపిస్తుంది- "శేఖరం తనను ఓ పిచ్చిదానిగా
మకట్టటంలేదుకదా" అని !

శేఖరంవైపు నిశితంగా చూసింది నీరజ. శేఖరం
నిర్మలంగా వున్నాయి. కావాలనే అతని కిష్టమైన రంగుచీర క
కుంది. అతను ఏం "కామెంట్స్" చేస్తాడో అని క్షణం ఎదు
చూసింది.

కానీ శేఖరం తన చూపుల్ని రేడియోవైపు మరల్చి "అన్నట్టు వార్తలొస్తున్నా యనుకుంటాను. రేడియో పెట్టు!' అన్నాడు.

నీరజకు కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. ఇంత చక్క సమయంలో వార్తలు వింటాననటా రేమిటి? అసలు తనమీద ప్రే వుందా? వుందని తాను భ్రమపడుతోందా? పోనీ అలా అనుకో టానికీ వీలులేదే! అతని కళ్ళల్లోని ఆరాధనా, అతని మాటల్లో ఆప్యాయతా, ప్రేమా స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. నీరజ గొంతుదాకా దుఃఖం వస్తోంది.

"వస్తా నీరజా!"-వార్తలు వినటం పూర్తికాగానే లేచా శేఖరం. తనూ లేచింది. మనసంతా ఎలాగోవుంది. ఏదో ఓదార కావాలి. అనుకోకుండా తెల్లని అతని అరచేతిని పట్టుకొని, అతని క్షణంలో అరక్షణం పెనవేసుకొని చటుక్కున విడిపోయిం నీరజ.

"నీరజా! ఇలాంటి కక్కుర్తిపనులంటే నాకు ఇష్ట లేదు"-అని తీక్షణంగా ఆమెవైపు చూసి వెళ్ళిపోయాడు శేఖరం

భూమిలోకి కృంగిపోయింది నీరజ. కట్టలు త్రెంచేసుకు వచ్చేసింది కన్నీరు. కక్కుర్తా? తనకా? ఓదార్పు కోరుకోవట కూడా తప్పా? అసలు అతని స్పర్శలో ఎంతటి విద్యుత్తుంది అటువంటి అనుభూతి అతనికిలేదా?.... లేదు! ... లేదు.... అత కేఅనుభూతులూ లేవు. వట్టి జడపదార్థం....! గుండెలు పగిలే ఏడ్చింది నీరజ.

మరునాడు లంచ్ టైంలో- కొన్ని క్షణాలు ఆలోచించి నీరజ.... 'టిఫెన్ తినటానికి వెళ్ళకపోతేనేం?....' ....కానీ త కాళ్ళు వాటంతట అవే తనను లాక్కొని వెళ్ళాయి.... అప్పటి నారాయణా, శేఖరం కూర్చొని నీరజకోసం ఎదురుచూస్తూ ఏ సీరియస్‌గా చర్చించుకుంటున్నారు.

"చూడు నారాయణా! నువ్ సరస్వతికోసం పరితపించడం ఏమీ బాగాలేదు.... పురుషునిచుట్టూ స్త్రీయే పరితపిస్తూ తిరగాలికానీ పురుషుడు ఆరాటపడి, ఆవేశపడి తిరక్కూడదు-"

శేఖరంమాటలు వింటూనే నీరజ కొయ్యబారిపోయింది.

దారుణం!... చివరికి శేఖర్ మనస్తత్వం ఇదన్నమాట! ఇదే అతని అసలు స్వరూపమన్నమాట! ఎంత ఘోరం?....అలా స్త్రీని పిచ్చిదానిలా తనచుట్టూ తిప్పుకోవటం పురుషునికి ఆనందమా? తాను ప్రేమించిన పురుషునిచుట్టూ స్త్రీ ఎంతవరకూ ప్రదక్షిణలు చేస్తుంది?.... మనసు శిలగా మారిపోయేటంతవరకే!.... అంత వరకూ ఓపికపడుతుంది.... శిలగా మారిపోయినతరువాత- ఆమెను తిరిగి మనిషిగా మార్చటం బ్రహ్మతరంకూడా కాదు!

"అదేమిటీ, అక్కడే నిలబడిపోయారు! రండి ... త్వరగా ఫినిష్‌చేస్తే - నేను వెళ్ళాలి.... నాసీట్లో చాలాపనుంది ఇవాళ!.... ఇంతసేపూ మీగురించే ఎదురుచూస్తున్నాం"- నారాయణ మాటలతో వాస్తవానికొచ్చింది నీరజ.

"ఇవాళ ఆకలిగాలేదు! మీరు తినండి! అది చెప్పటానికే వచ్చాను"- గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది నీరజ,

టిఫిన్ తినటం పూర్తయినాక శేఖరంకూడా లేచి తనసెక్షన్ లోకి వెళ్ళిపోయాడు.

సీట్లో కూర్చున్నదన్నమాటేగానీ, కొంచెంకూడా పని జరగటంలేదు నీరజకు. శేఖరంమాటలే పదేపదే గుర్తుకొస్తున్నాయి. అసలు అతని వుద్దేశ్యం ఏమిటో తేల్చుకోవాలి!.... ఆ ఆవేశం తోనే మళ్ళీ శేఖరంవగ్గరకు వెళ్ళింది.

అతనికి ఎదురుగా.... ఎవరో ఒకామె కూర్చునివుంది. నల్లని జాకెట్ క్రింద తెల్లని నడుం కనిపిస్తోంది.... మొహం కనిపించటంలేదు.... ఆమె శేఖరంతో ఏదో మాట్లాడుతోంది.

అంతే!.... చటుక్కున వెనక్కితిరిగి వచ్చేసింది నీరజ.

ఓ గంట గడిచిన తరువాత శేఖరంవచ్చి తన వద్ద కూర్చుంటూ—

"ఇందాకా నువ్ చూసినావిడ పెద్దరచయిత్రి.... ఏదో నవల రాస్తోందట.... నా సలహాకోసం వచ్చింది"- అన్నాడు.

"ఇప్పుడువచ్చి సంజాయిషీ చెప్పుకోవాలా?" అడిగింది నీరజ.

నీరజ పైకి మామూలుగా అన్నా - మనసులో ఆమెమీద జెలసీలాంటిది లేకపోలేదు.... కారణం తాను రచయిత్రి కాక పోవటమే!

"చెప్పటం నా విధి!" అన్నాడు శేఖరం అతిమామూలుగా. నీరజకు సంతోషం కలిగింది. అందుకే శేఖర్ వ్యక్తిత్వమంటే తనకు ఇష్టం.... అయినా 'జెలసీలాంటిది ఎందుకు ఏర్పడుతోందీ తనకో? తను ఎంతమంది మగవాళ్ళతో మాట్లాడటంలేదూ? శేఖరం ఎప్పుడైనా తనలా జెలసీ ఫీలయ్యాడా?.... మరి తనెందుకింత దిగజారి పోతోంది? లేదు.... శేఖరం ఇంకా పెద్దరచయితకావాలి. అందుకు పదిమందితో అతను తిరగాలి. అప్పుడే జీవితాలనూ - మనుష్యులనూ అర్థంచేసుకునే అవకాశం అతనికి కలుగుతుంది.... అందుకోసమే నీరజ తపనా - తపస్సు!

* * * *

అక్కౌంటెంట్ వెంకట్రావుగారి అమ్మాయిపెళ్ళి, వారి స్వంతఊరు కర్నూలువద్ద ఓపల్లెలో జరుగుతోంది. ఆఫీసులో వారంతా పెళ్ళికి వెళ్ళటానికి వీలుగా ఓ స్పెషల్‌బస్సు ఏర్పాటు చేశారు. వెంకట్రావుగారు అందర్నీ మనస్ఫూర్తిగా ఆహ్వానించారు. శేఖరంతో కలిసి ప్రయాణం అనగానే నీరజకు ఎంతో ఆనందం కలిగింది. ఈ ప్రయాణం శేఖరానికి అట్టే ఇష్టంలేకపోయినా నీరజ ఉత్సాహంచూసి కాదనలేక పోయాడు. ఆఫీసువాళ్లు చాలామందే బయల్దేరారు.

అందరూ బస్సెక్కారు. శేఖరంప్రక్కన కూర్చునే అదృష్టం నీరజకు కలుగలేదు. అయినా సరి పెట్టుకుంది. తప్పనిసరిగా శకుంతలపక్కన కూర్చోవలసివచ్చింది. దారిపొడుగునా శకుంతల తో వాగుతూనే వుంది. విసుగొచ్చింది నీరజకి.



ఎప్పటికీ మీకేమీకాను!

పెళ్ళి ఎంతో ఆర్భాటంగా జరిగిపోయింది. తామందరికీ - వెంకట్రావుగారు ఎన్నో మర్యాదలు చేశారు. ఓ ప్రత్యేకమయిన ఇంటిలో అందరికీ సౌకర్యంగా వుండేలా బస ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి భోజనాలు కూడా అయ్యాక - బడలికతో కొంతమంది నిద్రకుపక్రమించారు. మరికొంతమంది వెన్నెట్లో కూర్చున్నారు. దూరంగా పెళ్ళివారింటినుంచి సన్నాయి వినిపిస్తోంది.

వేపచెట్ల వెనుక నుంచివస్తున్న చంద్రుడ్నీ- ఆకుల్లోంచి సందుచేసుకొనిదూకుతున్న వెన్నెలనూ మైమరచిచూస్తున్న నీరజకు అప్రయత్నంగా శేఖరం కనిపించాడు.... అసలీ ప్రపంచంలోనే లేడు.... ఆకాశాన్నీ, వెన్నెల్నీ, పరుగులుతీస్తున్న దూదిపింజల్లాంటి మబ్బుతునకల్నీచూస్తూ - ప్రక్కన నీరజవుందన్న సంగతినికూడా పట్టించుకోకుండా - ఏదో తన్మయత్వంలో వున్నాడు.

'అంతటి అందమైన, అపురూపమైన వాతావరణంలో ఒక్క సారి తన కళ్ళల్లోకి శేఖర్ చూడకూడదూ ?....' అనుకుంది నీరజ. అయినా అలా చూడకపోవటమే మంచిదేమో ?.... అలా అతను చూసివుంటే తనేమయిపోయేదో ? ఎక్కడికక్కడ శేఖరం అలా కళ్ళాలు 'బిగించకపోతే, నలుగురిచేతా వేలెత్తి చూపించుకునే పరిస్థితి తనకు కలిగేదేమో ?.... మనస్సుని ఎలాగో సమాధాన పర్చుకుంది నీరజ.

అంతలో ఎవరోవచ్చి- అందర్నీ పెళ్ళివారింటికి తీసుకె పోయారు_ ఏవో వేడుకలు జరుగుతున్నాయి చూడాలంటూ... బంధువులతోపాటు వధూవరులిద్దరికీ అక్కడ ఫొటోలుతీశారు స్నేహితులతోకూడా ఫొటోలు తీయించాలని వెంకట్రావుగా వుబలాటం.... శేఖరంప్రక్కనే నిలబడింది నీరజ... ఈ హడావి చూస్తుంటే తనకూ శేఖరానికీ వివాహం జరుగుతున్నట్లూ.... ఫొటోలో వధూవరులై నిలబడినట్లూ- దివ్యమయిన అనుభూతుల్ తేలిపోయింది.

తెలతెలవారుతూంటే_ దూరంగా విడిదిలోంచి సన్నాం వినిపిస్తోంది. నీరజలేచి కిటికీలోంచి బయటకుచూసి తన్మయత్వం

మునిగిపోయింది. జావిదగ్గర శేఖరం మొహం కుడుక్కుంటున్నాడు. పచ్చటి ముఖం.... నుదుటిమీద చెదిరిన ముంగురులూ.... వాటితో బాటు హత్తుకుంటున్న అరుణరేఖలూ.... వింతసోయగంతో పెళ్ళి కుమారునిలా కనిపించాడు.... ఆ దృశ్యం అతి మనోహర దృశ్య కావ్యంలా- నీరజ హృదయంలో ముద్రవేసుకుంది ఆ క్షణాన.

తిరుగు ప్రయాణంలో- శేఖరానికి ముందేచెప్పింది నీరజ- "ఏమయినా, ఎవరేమనుకున్నా మీరు నా ప్రక్కనే కూర్చోవాలి"- అని.

ఆమె మాటలకు మధురంగా సన్నగా నవ్వి వూరుకున్నాడు శేఖరం.... నీరజ మనసులో పరుగులు తీసే భావాలవంటివే శేఖరం మదిలోనూ చోటుచేసుకునేవి.... కానీ సమయం వచ్చేదాకా నిగ్రహించుకోవాలనే మనస్తత్వం అతనిది.

బస్సులో-ఇద్దరు కూర్చునే సీటులో- కిటికీవద్ద శేఖరం, అతనిప్రక్కన నీరజా కూర్చున్నారు.... దూరంగా పశుపతిపక్కన కూర్చుని- తెగ వాగుతోంది శకుంతల.... మిగతావాళ్ళు ఎవరి హడావిడిలో వాళ్ళున్నారు.

బస్సు బయల్దేరింది.

క్షణక్షణానికీ కొత్త అందాల్ని సంతరించుకునే ప్రకృతి - తనను నిశితంగా పరిశీలించేవారికి - అందమైన అనుభూతుల నిస్తుంది.... ఆకాశంనిండా మబ్బులు పరుగులు తీస్తున్నాయి.... చల్లని గాలివీస్తూ - చలి చలిగా వుంది. దూరంగా వర్షం పడుతోంది కాబోలు - దృశ్యాలు సరిగా కనిపించకుండా, ప్రకృతి కన్నెపై పట్టుపరదా వేసినట్టుగా వుంది. శేఖర్‌మీదుగా కిటికీ లోంచి కనుపించే దృశ్యాలు రమణీయంగా వున్నాయి. శేఖరం వైపు చూసింది నీరజ.... అతను కళ్ళుమూసుకుని చేతులు కట్టుకొని కూర్చున్నాడు.

ఆశ్చర్యపోయింది నీరజ.... మంచి రచయిత.... మళ్ళీ ఇలాంటివి ఇక కనిపించవేమో అనుకునేటంతటి సుందరమైన దృశ్యాల్ని చూడకుండా కళ్ళు మూసుకుని - మునీశ్వరుడిలా

కూర్చున్నాడేమిటి ?.... వెంటనే మళ్ళీ జ్ఞాపకం వచ్చింది - అంతకు ముందురోజు పెళ్లి హడావిడిలో సరిగా నిద్రలేదుకదా అని !

దారిలో ఎక్కడో - అందరూ దిగి కాఫీలు తాగి మళ్లీ బస్సులో ఎవరి సీట్లలోవారు కూర్చున్నారు. శకుంతల కబుర్లు చెబుతూనే వుంది. బస్సు వెడుతూంటే చల్లనిగాలి వీస్తోంది.

సన్నగా ఏదో పాడుకుంటున్నాడు శేఖర్. ఆ పాట గాలిలో మధుర తరంగాలపై తేలుతూ - నీరజకు గమ్మత్తుగా గిలిగింతలు పెడుతూంటే, అతనివైపు తమకంతో చూసింది.

శేఖరం చటుక్కున పాట ఆపేసి - 'ఏమిటీ అలా చూస్తున్నావ్ ?' అన్నాడు.

"అఁహఁ ! ఏంలేదు"- తల ప్రక్కకు తిప్పేసుకుంది. అతనివైపు చూడటం కూడా తప్పే కాబోలు.... ఏమిటి అతని ఆంతర్యం ? మళ్ళీ నీరజ గుండెల్లో సన్నటి బాధ రేగింది.

"ప్రయాణాల్లో - చిన్నగా పాడుకోవటం నాకు అలవాటు. ప్రక్కనున్నవాళ్ళు ఎవరైనా విని నవ్వుతారేమోనని_నాలో నేనే- కళ్ళు మూసుకుని- పెదాలుకూడా కదపకుండా-గొంతులోనే పాడుకుంటూంటాను....కాలేజీలో చదువుకునే రోజుల్లో సీతానగరంనుంచి టౌన్‌లో వున్న కాలేజీకి, రోజూ బస్సులో వెళ్ళి వస్తూండేవాడిని. దారిపొడుగునా గలగల పారే కాలువలూ, కొబ్బరితోటలూ, మామిడి తోపులూ చూస్తూంటే మనసు "పరవశించి - ఇలాగే పాడుకునేవాడ్ని. కొన్ని జ్ఞాపకాలు జ్ఞాపకాలుగానే మిగిలిపోవటం ఎంతో బాగుంటుంది కదూ ?"— దూరంగా ఆకాశంలోకి చూస్తూ అన్నాడు శేఖరం.

"హుఁ.... నా పరిచయంకూడా తీయని జ్ఞాపకంగా మిగిలిపోవటమే శేఖరానికి ఇష్టంకాబోలు" - నీరజ మనసు తీవ్రంగా గాయపడింది.

బస్సుదిగేవరకూ శేఖరాన్ని పలుకరించనే లేదు నీరజ. కానీ శేఖర్ రెండుసార్లు ఏదో మాట్లాడి - సరైన సమాధానం నీరజ నుంచి రాకపోవటంతో ఊరుకుండిపోయాడు.

తానెందుకలా మౌనం వహించిందో, కారణం చెప్పమని శేఖరం అడుగుతాడేమో అని ఆశించిన నీరజ, అతని మౌనానికి బాధపడింది. 'అంతకంతకూ అర్థంకాకుండా పోతున్నాడా ఈ శేఖరం?' అనికూడా అనుకుంది.

* *

"నీరజా.... నీరజా,"

హడావిడిగా పిలుస్తూ వచ్చిన శేఖరం - నీరజను చూసి ఆశ్చర్యపోయాడు.

"అదేమిటీ, ఇంకా అలాగే కూర్చున్నావేం?.... మనం ఎగ్జిబిషన్‌కి వెడదామనుకున్నాం కదూ?" - అడిగాడు.

"మీకు జ్ఞాపకం ఉందని అనుకోలేదు. అయినా ఇవాళ వెళ్ళకపోతేనేం?...."

"పోనీ పేకాడుకుందాం. మీ నాన్నగార్ని ఇవాళ క్లబ్‌కి వెళ్ళొద్దని చెప్పు."

నీరజకు నిరాశా నిస్పృహా ఆవరించాయి.

రానని తానంటే, బ్రతిమలాడి, బుజ్జగించి, తనతో తీసుకవెడతాడని అనుకుంది. అలాంటి అనుభూతికి తాను నోచుకోలేదేమో?

శేఖరంతో వెళ్ళాలనే వుంది.

"సరే ఇప్పుడే వస్తాను! ఎగ్జిబిషన్‌కే వెడదాం"—

"అయితే తొందరగా తయారవ్."

చేతికి దొరికిన పుస్తకంలో తల దూర్చేశాడు శేఖరం.

అరగంటలో తయారయింది నీరజ .... బయల్దేరేముందు తండ్రిగదిలోకి వెళ్ళి....

"నువ్‌కూడా ఎగ్జిబిషన్‌కి రాకూడదా నాన్నా!.... పగలంతా పుస్తకాలూ.... సాయంత్రం కాగానే క్లబ్బూ!.... కాసేపు మాతో గడిపితే కాలక్షేపం అవుతుందిగా?".... అని అడిగింది.

"వద్దుతల్లీ! రామ్మూర్తిలాగే నేనూ ఇక మిగిలినజీవితాన్ని ఆధ్యాత్మిక చింతనలోనే గడిపేయాలనుకుంటున్నాను. ఇక క్లబ్బం

టావా, కాసేపు పాతస్నేహితులందరితోనూ గడిపివస్తే, ప్రాణం లేచి వచ్చినట్లుంది.... నన్నొదిలేసి, నువ్వూ శేఖరమూ వెళ్ళిరండి". -

తన తండ్రి అలా మాట్లాడుతూంటే నీరజ మనసెందుకో అర్ద్రమైంది.... ఒకప్పుడు సింహంలా బ్రతికిన తనతండ్రి - అల వాట్లనూ, హోదానూ- దర్పాన్నీ వదిలేసి వానప్రస్థాశ్రమంలోవున్న యోగిలా వుంటున్నాడు.

* * * *

ఎగ్జిబిషన్ ఎంతో సందడిగావుంది.... రంగురంగుల దీపాల తోరణాలు.... ఆ దీపాలమధ్య దీపకళికలా మెరిసిపోతోంది నీరజ.... క్రీమ్‌కలర్ చీరకు - జరీవర్క్- చేయటంవల్ల చీరంతా, దీపాల వెలుగుతో ధగధగా మెరుస్తోంది.

కాశ్మీర్ స్టాల్‌వద్ద కాసేపు నిలబడిపోయింది నీరజ.... అక్కడ గోడకు తగిలించిన కాశ్మీరు దృశ్యాలూ-చందనంతోచేసిన రకరకాల డెకరేషన్లూ చూస్తూ - విభ్రాంతిగా అలాగే నిలబడి పోయింది.

"రా నీరజా! ఐస్‌క్రీమ్ తిందాం!.... నీకు ఇష్టంకదూ?"-

ఇద్దరూ వెళ్ళి ఐస్‌క్రీం తిన్నారు.... జయింట్‌వీల్‌మీద కాసేపు, గుండ్రంగా తిరిగారు. ఆకాశాన్ని తాకి భూమ్మీదకు దిగారు. ఒళ్ళు తూలినట్లయింది నీరజకు. తన గుండెలకు దగ్గరగా ఆమెను హత్తుకుంటూ 'కళ్ళు తిరిగాయా?'.... అన్నాడు.... సిగ్గుతో తల వంచుకుంది నీరజ.

ఆమెను నెమ్మదిగా నడిపించుకుంటూ వెళ్ళి - అక్కడకు దగ్గర్లోవున్న బెంచీమీద కూర్చోబెట్టాడు.

మరి కాసేపు ఎగ్జిబిషన్‌లో తిరిగి - బయటకు వచ్చేశారు.

తిరిగివచ్చేటప్పుడు ఆటోలో, నీరజచేతిని, తనచేతిలోకి సుతారంగా తీసుకుని-

"ఈచీర నీకు ఎంతబాగుందో తెలుసా?"- అన్నాడు శేఖరం మృదువుగా....

నీరజ పరవశించిపోయింది...., హృదయంలో కోటి నయా

గరాలు ఉవ్వెత్తునలేచాయి.... బయట పసకవెన్నెల.... ప్రక్కన శేఖరం!.... తలలో విరిసిన మల్లెలు.... తనచేయి శేఖర్ చేతిలో ఇమిడిపోయి సన్నగా వణుకుతోంది.

'ఈ చేతిని ఎప్పటికీ వదలకు శేఖర్.... వదలకు!.... నీ చేతిలో చేయికలిపి, దిగంతాలవరకూ ప్రయాణిస్తాను.... ఇంద్ర ధనస్సును అందుకుంటాను.... మనసెప్పుడూ, మనసైన వాటినే కోరుకుంటుంది.... మనసులో చెలరేగే ఆ కోరికలు వనదేవత శిరస్సున వికసించే మల్లెపూల మాలికలు!....'

ఇంకా ఎన్నో అనాలనుకుంది.... కానీ అవన్నీ గొంతులోనే ఆగిపోయాయి.... ఇంతలో ఆటోరిక్షా ఇంటిముందు ఆగింది.... బరువెక్కిన హృదయంతో అతనికి వీడ్కోలుచెప్పింది నీరజ....

ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు.... ఎన్నో.... ఎన్నెన్నో సుందర స్వప్నాలు....

*　　*　　*　　*

ఆఫీసులో అడుగుపెట్టగానే, అంతక్రితంరోజు సంఘటన జ్ఞాపకంవచ్చి మధురంగా నవ్వుకుంది నీరజ.... సరాసరి శేఖర్ సీటువగ్గరకు వెళ్ళింది.... అతనిసీటు ఖాళీగావుంది....ప్రక్కసీటులో వుండే మైకేల్‌ను అడిగింది శేఖరంగురించి.

శెలవుచీటి పంపాడని సమాధానం వచ్చింది.

ఉసూరుమంటూ తన సెక్షన్‌కువచ్చి కూర్చుంది.... పనిమీద మనసు లగ్నంకాలేదు.... సాయంత్రం అవుతోందనగా శకుంతల వచ్చింది ఆమె సీటువగ్గరికి.

'షాపింగ్‌కిరావాలి! రెండుశారీస్ కొనాలనుకుంటున్నాను.... సెలక్షన్ నువ్ చేయవలసిందే'– అంటూ బలవంతం చేసింది శకుంతల.

అసలే ఆమె మనసు బాగాలేదు.... త్వరగా ఇంటికి వెళ్ళిపోవాలని వుంది. పైగా 'శేఖరం ఇంటికి వస్తాడేమో' అనే ఆశ వాడా లేకపోలేదు.... కానీ శకుంతల నీరజను వదిలిపెట్టలేదు .... తప్పనిసరిగా శకుంతలతో షాపింగ్‌కి వెళ్ళింది.... చీరల సెలక్ష

నం జేమాటలా?.... తెలియకుండానే చాలాసమయం గడిచిపోయింది.

చివరికి నీరజ అనుకున్నట్టే అయింది.... ఇంటికి రాగానే శ్రీనివాసరావుగారు చెప్పారు-'శేఖరం నీకోసం చాలాసేపుచూచ్చిని వెళ్ళిపోయాడమ్మా'- అని.

నీరజమనసు విలవిల్లాడింది.... తను లేని సమయంలో శేఖరం వచ్చాడు. తను వుండివుంటే ఏం మాట్లాడేవాడో? .... నిజంగా ఎంత దురదృష్టం ?

విరహంలో సుఖంవుందో లేదో తెలియదుకానీ, వేదన మాత్రం వుంది. ఆ వేదన ఆవేదనగా మారినప్పుడు. గుండె అంచుల్లోంచి లావా ఉబుకుతుంది. ఆ రాత్రి ఆమెకు చీకటినే మిగిల్చింది.

మర్నాడు ఆఫీసులో, శేఖరంవద్దకు వెడుతూనే —

"మీరు నిన్న సాయంత్రం మా యింటికి వచ్చివెళ్ళారా ?"- అని అడిగింది.

సీరియస్‌గా ఏదో ఫైల్ చూస్తున్న శేఖరం తల ఎత్తకుండానే —

"అవును, చాలా సేపు వెయిట్ చేసి వెళ్ళిపోయాను."

"ఏం? మరికాసేపు వుండలేకపోయారా ?.... మీరూ అలా వెళ్లారట.... నేనూ వచ్చేశాను.... నాన్నగారు ఎలాగా క్లబ్‌కి వెళ్ళలేదు. ఆయనతో కాసేపు మాట్లాడుతూ కూర్చోవలసింది."

"నేను వచ్చింది మీ నాన్నగారితో మాట్లాడటానికీ - మీ అమ్మమ్మగారితో మాట్లాడటానికీ కాదు" - తలఎత్తికూడా చెప్పలేదు ఆ మాటలు. నీరజకు చాలా బాధ కలిగింది. తన సెక్షన్‌లోకి వెళ్ళిపోయింది. ఫైల్స్ చూడబుద్ధికావటంలేదు....కుర్చీలో వెనక్కివాలిపైన తిరుగుతున్న సీలింగ్‌ఫాన్‌కేసి చూస్తూ కూర్చుంది.

"శేఖరం ప్రవర్తన రానురాను విచిత్రంగా తోస్తోంది. మొన్నరాత్రి స్వర్గానికి తీసుకవెళ్ళి - ఇప్పుడింత హఠాత్తుగా నరకానికి ఎందుకు లాగేసినట్టూ ?.... ఇదే అసలు ప్రవర్తన, అదే తాత్కాలిక ప్రవర్తనా ?" ఆ సందేహం క్రమంగా పెద్దదై - ఆమె హృదయాన్ని బ్రద్దలు కొడుతోంది. కణతలు పగిలి

పోతున్నాయి. ఏదో తెలియని బాధ నరాల్ని పిండేస్తోంది. కళ్ళు తిరిగిపోతున్నాయి. ఫైల్సూ, టేబులూ, బీరువాలూ అన్నీ గిరగిరా తిరిగిపోతున్నాయి.... కళ్ళు మూసుకుపోతున్నాయి.... ఏదో మైకం కమ్ముతున్నట్లయి పోయింది.

తోటివాళ్ళంతా హడావిడిగా నీరజ చుట్టూ చేరారు. కుర్చీని వెనక్కి దూరంగా లాగి - ఆమెకు సపర్యలు చేశారు. శకుంతల ఆమె తలను ఒడిలో పెట్టుకుంది.... ఓ అయిదారు నిముషాల్లో లేచి కూర్చుంది గాభరాగా!

"ఏమయింది? .... ఇప్పుడెలా వుందీ?" .... కొలీగ్స్, ఆదుర్దాగా చూస్తూ ప్రశ్నిస్తున్నారు.

సరిగ్గా అప్పుడే.... శేఖరం అటుగా వెడుతూ, అక్కడకు వచ్చాడు.

"ఏమయిందీ?" అడిగాడు.

శకుంతల చెప్పింది.

అందరిలాగే అతనూ పలకరించి వెళ్ళిపోయాడు.... దుఃఖం ముంచుకొచ్చింది నీరజకు. నలుగురితోబాటే, తనూ పలకరించాడు.. ఆపలకరింపులో ఆప్యాయతగానీ, ఆత్మీయతగానీ కనిపించలేదు.... నారాయణమాత్రం చాలా ఖంగారుపడిపోయాడు.... సెక్షన్ ఆఫీసరు నీరజను ఇంటికివెళ్ళిపోయి రెస్ట్ తీసుకొమ్మన్నాడు.... నారాయణ రెండ్‌మంటూ అక్కడనుంచి వెళ్ళిపోతోంటే, నీరజ మనసులోనే అనుకుంది- 'బహుశా నారాయణ శేఖరాన్ని తీసుకరావటం కోసమే వెళ్ళివుంటాడు'- అని.

నారాయణ మరో అయిదు నిముషాలకు తిరిగివచ్చి-

"లెండి నీరజగారూ! ఆటో తీసుకొచ్చేశాను!"- అంటూ తొందర చేశాడు....

శేఖర్ కనిపిస్తాడేమోనని చుట్టూ చూసింది.... శేఖరాన్ని పిలుచుకువచ్చమ్మని నారాయణను అడగటం బాగుండదు....ఎలామరి? ఇష్టంలేకుండానే కదిలింది నీరజ.

ఆటోవరకూ, శకుంతలా - మేరీ - ప్రకాష్ వెళ్ళారు....

శేఖరంమాత్రం రాలేదు.... 'వీళ్ళందరికీ వున్న దాక్షిణ్యంకూడా అతనికి లేకుండా పోయిందా?'.... గుండెల్లో తీవ్రమైన బాధ.... ఎలాగో ఆటోలో కూర్చుంది.... ప్రక్కన నారాయణ కూర్చుం టూంటే నెమ్మదిగా అడిగింది.

"శేఖరంగార్కి చెప్పారా! ఒకవేళచెప్పకపోతే, ఇప్పుడైనా చెప్పిరండి నేను వెళ్ళిపోతున్నానని–"

మీరు గమ్మున కూర్చోండి! ఆయన వస్తారుకానీ...."

నీరజలో ఆశ చిగురించింది. 'అంతమంది ఆఫీసువాళ్లు చూస్తూండగా తనతో కలిసి రావటం ఇష్టలేక దారిలో ఏదైనా బస్ స్టాండ్‌లో ఎదురుచూస్తూండవచ్చు....' అనుకుంది. ఆటో బయల్దే రింది. కొంచెందూరం వరకూ రోడ్డు ప్రక్కకు చూస్తూనేవుంది శేఖరం కోసం. నీరసం ముంచుకొస్తూంది.

"నారాయణగారూ– ఆయన కనిపించరేం?... ఎక్కడుంటా నన్నారూ? అడిగింది ఆతృతగా.

"మీరు ఇంటికిపదండి! ఆయన అక్కడకు వస్తార్లెండి!"– అన్నాడు నారాయణ పరధ్యానంగా, ఎటోచూస్తూ–

ఇంటికి వచ్చిన తరువాత ప్రతిక్షణం ఎదురుచూసింది నిరజ. వంట్లో ఎంతో నీరసంగా వుంది!.... అసలింత సుస్తీ చేసినట్టుగా ఎందుకయిందీ?.... శేఖరం ఎందుకని రాలేదు....? ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకటంలేదు. రాత్రి ఎప్పటికో నిద్రపట్టింది నీరజకు.

ఉదయం నుండీ మళ్ళీ మొదలు నిరీక్షణ.

అడుగుల చప్పుడు విని వులిక్కిపడింది. శేఖరేవచ్చాడని అనుకుంది.

"హలో నీరజగారూ! ఎలావుంది?" – అంటూవచ్చిన నారాయణకేసి చూస్తూనే ఒళ్ళు మండిపోయింది నీరజకు.

ప్రక్కకు ఒత్తిగిలి పడుకుంది. అతనిముఖం చూడాలని కూడా అనిపించలేదు. తన సుందర స్వప్నాలను పునాదులతో సహా పెకలించిన రాక్షసునిలా కనిపించాడు నారాయణ.

ప్రక్కనేవున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమండీ నీరజగారూ. శేఖరంగారు వచ్చారా నిన్న? నేను మిమ్మల్ని ఇక్కడ దించి, మళ్ళీ ఆఫీసుకు వెళ్ళి చూసేటప్పటికి ఆయన వెళ్ళిపోయారు. బైదీబై మీ ఆరోగ్యం ఎలావుంది?"—

తనలో ప్రజ్వరిల్లుతున్న కోపాన్ని - ఎలాగో అణచుకుంటూ.

"నారాయణగారూ! నాకో సహాయం చేస్తారా?" - అని అడిగింది నీరజ.

"ఏమిటీ" అన్నట్లు ఆసక్తిగాచూశాడు.

"నిన్న మీరు చేసిన పనిని దయచేసి శేఖరంగారికి ఫోన్లో చెప్పండి.

"ఓయస్! అలాగే!" - ఫోన్‌దగ్గరకు వెళ్ళి శేఖర్ నంబర్‌కు డయల్ చేశాడు నారాయణ.

"హలో.... శేఖరంగారూ!" నేనే. నారాయణని! ప్రస్తుతం నీరజగారింటో వున్నాను. ఇక్కడనుంచే ఫోన్ చేస్తూంట!.... ఆవిడతో మాట్లాడుతారా?"—

ఓపిక తెచ్చుకొని ఫోన్‌వద్దకు వచ్చిన నీరజచేతికి అందించాడు రిసీవర్.

"ఎలా వుందీ?" పొడిగా అన్నాడు శేఖరం.

"ఎలావుంటే ఏంగానీ, ప్రొద్దుట్నుంచీ ఫోనయినా చేయలేదేం?"—

"తీరికలేదు!"

"తీరికలేదా?.... పోనీ ఇప్పుడోసారి ఇంటికిరాగలరా?"—

"వీలుపడదు.... చాలాపనుంది"—

"ఇహ వీలుకాదా?"— వచ్చేదుఖాన్ని గొంతులోనే దాచుకుంటూ అడిగింది.

అవతలివైపు నిశ్శబ్దం.

"థాంక్స్! నాకంటే మీకు పనులే ముఖ్యం. అవేచూసుకోండి"— ఫోన్ పెట్టేసింది.

మంచంమీద వాలిపోయి, తలగడలో తలమార్చి వెక్కి-వెక్కి ఏడ్చింది.

ఆమెవైపు జాలిగా చూశాడు నారాయణ.... ఈపరిస్థితికి తానే కారణమా అనికూడా అనిపించింది అతనికి.

"మరి నేను వెడతానండీ! శేఖరంగారు సాయంత్రంలోగా తప్పకవస్తారు.... మీరు అనవసరంగా బాధపడకండి...."- ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండానే వెళ్ళిపోయాడు నారాయణ.

మనసంతా బాధతో సుళ్ళుతిరుగుతూంటే - ఎన్నోగంటలు ఒంటరిగా గడిపేసింది నీరజ.... ఇందులో తన తప్పేమీలేదు.... నారాయణ తొందరపాటే తనకీ శిక్ష విధించింది. చూస్తూండగానే చీకటి అలముకుంటోంది. శేఖరం రాకకోసం చూసి చూసీ తనకళ్ళు అలసిపోయాయి. ఇప్పుడు కళ్ళల్లోకి నీళ్ళుకూడా రావటంలేదు.

ఒకవేళ, తనమీద కోపంకొద్దీ రాకపోయినా - తనను చూడ కుండా శేఖరం వుండలేడు....రేపైనా తప్పక వస్తాడు.

ఆ ఆశతోనే రాత్రంతా గడిపేసింది.... మళ్ళీ నిరీక్షణ.... ఈ నిరీక్షణలోనే తనప్రాణంకాస్తా ఎప్పుడో కొండెక్కి-పోతుంది... తన ఆలోచన మళ్ళీ తనకే నవ్వు పుట్టించింది.... ప్రాణంపోవటం అంత సులభమా ?.

పోనీ ఆఫీసుకువెళ్ళి తానే శేఖరాన్నిచూస్తే ?....తానిప్పుడు శలవులోవుంది....పైగా నీరసం....జ్వరం!.... వెళ్ళటం కష్టమే!

అయినా శేఖరం మధ్యాహ్నం వస్తాడేమో ?.... అంతలోనే ఆశ.... ఆశ ఎంతచిత్రమైనది ?....పోయేప్రాణాన్నికూడా నిలుపు తుంది....ఆశనేది లేకపోతే రేపనేదేలేదు....చీమ చిటుక్కు-మన్నా శేరమే వస్తున్నాడని లేచి చూసేది.... తన ఆత్రుతకు తానే నవ్వుకొనేది.

ఫోనూచేయలేదు....తానూ రాలేదు .... అయినా ఇంతశిక్ష విధించటం భావ్యంకాదు....అయినా తన హృదయంలోని బాధనూ, తపననూ, శేఖరం ఏనాడు అర్థం చేసుకున్నాడుకనుక ?.... తాను శేఖరానికి ఏమీకాదు.... శేఖరానికి తానక్కర్లేదు!.... మూడు

రోజులు.... ఇన్నిగంటలు.... ఇంతకాలం.... తనను చూడకుండా శేఖరం ఉండగలిగాడంటే జీవితాంతంవరకూ తాను లేకుండా, తనను చూడకుండా గడిపేయగలడు.

అవును!.... అదే నిజం!.... ముమ్మాటికీ అదే నిజం.... ఈ భయంకరమైన నిజాన్ని తెలుసుకుందుకు ఇంతకాలం పట్టింది. ఆలోచనలు నీరజను పిండేస్తున్నాయి.... గుండెలు పగిలిపోతున్నాయి.... తా నిప్పుడు జీవచ్ఛవంలా బ్రతుకుతోంది.... ఇక మామూలు మనిషికాలేదు.... రాయిగా, శిలగా మారిపోతోంది.... అంతే!.

* * * *

మరో రెండు రోజులు గడచిపోయాయి.

ఆఖరిసారిగా శేఖరానికి ఫోన్ చేసింది నీరజ – ఒక్కసారి – తనను – పబ్లిక్‌గార్డెన్స్‌లో కలుసుకొమ్మని .... ఆ రోజు సాయంత్రం అయిదుగంటలు కాగానే – తాను పబ్లిక్ గార్డెన్స్‌కు చేరుకుంది.

శేఖరం దూరంనుంచే నీరజను చూసి ఆశ్చర్యపోయాడు. ఎంతో నీరసంగా – జీవితంలోనే అలసిపోయినట్లు కనిపించింది. దగ్గరగావచ్చి ఆమెకు ఎదురుగా కూర్చున్నాడు .... నీరజ తల వంచుకుని గడ్డిపరకల్ని లాగుతోంది.

ఆమెవైపు నిశితంగా చూశాడు శేఖర్.

నీరజ కళ్లు వాచివున్నాయి. ఎన్నో లంఖణాలు చేసినట్లుగా నీరసంగా వుంది.

"పిచ్చి నీరజా! అనవసరంగా నీ మనసు గాయపరచాను"– అని తనలో తానే అనుకున్నాడు. పైకి "ఏం మాట్లాడాలా" అని ఆలోచనలో వుండగానే నీరజ అంది—

"నాకు తెలుసు శేఖరం! మీ దృష్టిలో నేనొక కీలుబొమ్మను .... మీరు నవ్విస్తే నవ్వటానికీ – ఏడిపిస్తే ఏడవటానికీ – ఇక నాకు శక్తిలేదు. మీ చుట్టూ నన్ను తిప్పుకోవాలని మొదటినుంచీ మీరు అనుకుంటూనే వున్నారు. ఆ విషయం ఒక



ఎప్పటికీ మీకేమీకాను!

సారి మీరు నారాయణతో అంటున్నప్పుడే అర్థం చేసుకున్నాను. ఏది ఏమైనా ఇకనుంచీ మిమ్మల్ని నేను వేధించవలచుకోలేదు. చివరిసారిగా మీకు వీడ్కోలు చెప్పటానికే - మిమ్మల్నిలా శ్రమ పెట్టాను....క్షమించండి .... వస్తాను...." - అంటూ లేచి స్లిప్పర్స్ తొడుక్కుని వెళ్ళిపోయింది.

నీరజ ఆవేశం శేఖరానికి క్రొత్తేమీకాదు .... కానీ ఈనాటి నీరజ ప్రవర్తనకు శేఖరం మనస్సు తీవ్రంగా గాయపడింది.

నిజంగానే నీరజ తననుంచి దూరంగా వెళ్ళిపోయిందా ?.... అలా వెళ్ళి తాను బ్రతకగలదా ? .... తన జ్ఞాపకాలనుంచి దూరంగా వుండలేదనే విషయం ఆమెకంటే శేఖరానికే బాగా తెలుసు.

నిజంగా నీరజ ఎంత తొందర మనిషి ? .... ప్రాణానికి ప్రాణంగా ప్రేమించాడు తాను .... తన దృష్టిలో ఆమె ఒక పసి పాప .... అమాయకురాలు .... మనిషి ఎదిగిందే తప్ప మనసు ఎదగలేదు .... నీరజ తనను ప్రేమిస్తోంది. ఆ విషయం తనకూ తెలుసు ! .... తామిద్దరి వివాహమూ శ్రీనివాసరావుగారికి అంగీకారమే ! .... అయినా వివాహం అయేటంతవరకూ కొన్ని నియమాలు విధిగా పాటించాలనే మనస్తత్వం శేఖరానిది ... అనేక విషయాల్లో నీరజ ఎలా ప్రవర్తించినా సరిపెట్టుకున్నాడు.

తనకుమాత్రం హృదయం లేదూ ? ఎంతసేపూ తన హృదయాన్ని గుర్తించి, తన కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలనే నీరజ కోరుకొంటోంది తప్ప - తనను ప్రేమించిన శేఖరానికికూడా ఊరడింపుకావాలనీ, ఆప్యాయత కావాలనీ అనుకోవటం లేదా ?..అయినా తాను - సంఘంలో ఒక వ్యక్తిత్వమున్న మనిషిగా - పదిమందిచేతా వేలెత్తిచూపించుకోబడటం ఇష్టంలేక - ఒక పరిధిలోనే ప్రవర్తిస్తున్నాడు!.... నీరజకూడా అలా ప్రవర్తించాలనే తాను కోరుకుంటున్నాడు?.... తనకు ఇంకా కొన్ని బాధ్యతలున్నాయి.... వాటిని కూడా వదుల్చుకొని - నీరజను పెళ్ళిచేసుకొని - చీకూ చింతా లేకుండా ఆమె సన్నిధిలో జీవితాంతం హాయిగా గడిపేయాలనుకున్నాడు.

ఆవిషయాన్ని ఆరోజున - నీరజకు చెప్పాలనికూడా అనుకున్నాడు శేఖరం... త్వరలోనే, శ్రీనివాసరావుగారికి చెప్పి - ముహూర్తం పెట్టించమని-రానే అడుగబోతున్నట్లుగాకూడా నీరజకు చెప్పాలనుకున్నాడు!.... కానీ....తన కా అవకాశం ఇవ్వకుండానే - ఏవేవో అనేసి చటుక్కున వెళ్ళిపోయింది!.... తన మాటల్నీ, హృదయాన్నీ ఎదుటిమనిషే ఎంతసేపూ. అర్థంచేసుకోవాలనుకునే నీరజ ఎదుటిమనిషికూడా అలాగే కోరుకుంటాదేమో అని ఎందుకనుకోదూ ?....

ఆలోచిస్తున్న శేఖరం కళ్ళల్లో కన్నీరు నిలిచింది.

అనేకసార్లు నీరజలాగే తానుకూడా గుండెల్లో సూదులు గుచ్చినట్టుగా మాట్లాడి ఆమెని నొప్పించాలని అనుకున్నాడు శేఖరం.... కానీ ఎందుకో - అమాయకమైన ఆమెచూపుల్ని చూస్తే - ఆమెను ఎన్నడూ ఏమీ అనలేడు, ఆ శక్తి తనకులేదు.... నీరజ తనది!.... తనవస్తువును కంటికిరెప్పలా కాపాడుకోవలసినబాధ్యత తనదేమరి.

కానీ ఎంత అనుకున్నా, మరెంత సరిపెట్టుకున్నా ఆనాటి సంఘటనమాత్రం తన కెంతో కష్టం కలిగించింది.

ఆఫీసులో నీరజ పడిపోయినరోజున....

ఆమెను అస్థితిలో చూడగానే - తానెంతో కలవరపడ్డాడు. అప్పటికే ఆమెచుట్టూ చాలామందిచేరి పరిచర్యలు చేస్తూ పరామర్శిస్తున్నారు.... అక్కడికీ తాను పలకరించాడు.... ఆమెను త్వరగా ఇంటికి తీసుకొని వెడదామని చెప్పి - టేబులుమీదనున్న ఫైల్సు మూసేసి, డ్రాయర్‌కూ, బీరువాకూ తాళాలువేసి అంతలో ఏదోఫోన్ వస్తే వాళ్ళకు సమాధానంచెప్పి హడావిడిగా నీరజకోసం మళ్ళీ ఆ రూమ్‌లోకి వెళ్ళేసరికి - ఆమె సీటు ఖాళీగా వుంది.

మోహన్ చెప్పాడు - నారాయణ ఆమెను ఇంటికి తీసుకెళ్ళాడని....

తాను కొయ్యబారిపోయాడు.... కాలు కదపలేకపోయాడు.... బలవంతంగా బయటకువచ్చి, రోడ్డుమీద నడుస్తున్నాడన్నమాటేగానీ, మనస్సు కుతకుతలాడిపోయింది.

నీరజ.... నారాయణతో వెళ్ళిందా?.... తనతో ఒక్క మాటయినా చెప్పాలని ఆమెకు తోచలేదా?.... తాను ఆమెకు ఏమీకాడా?

అవును.... ఎలా చెబుతుంది?.... నీరజకు నిలువెల్లా అహం!.... ఆవేశంతప్ప మరొకటి తెలియదు.... తనమీద ఏమాత్రం గౌరవంవున్నా- తనకోసం వేచిఉండేది.... మరి అలా నారాయణతో వెళ్ళిపోవటంలో అర్థం ఏమిటి? కనీసం అలా వెళ్ళే ముందు కబురయినా పంపవలసిన బాధ్యత ఆమెకులేదా?.... అసలు అలా ఆమె ఎలా వెళ్ళిపోగలిగిందో?

శేఖరానికి ఆలోచనలతో తల పగిలిపోతోంది.... గుండెల్లో ఏదో మంటగా అనిపించింది.... పబ్లిక్‌గార్డెన్స్‌లో దీపాలు వెలిగిన తరువాత బయల్దేరి ఇంటికి వచ్చాడు.... ఆరాత్రి భోజనంకూడా చేయకుండా పడుకున్నాడు.... అలసిపోయినశరీరానికీ- వ్యధచెందిన మనసుకీ మగత ముంచుకొచ్చింది.... కళ్ళు బరువుగా మూతలు పడ్డాయి.

ఓ అర్ధరాత్రి శేఖరానికి మెలకువ వచ్చింది. దాహమయినట్లు అనిపిస్తే వెళ్ళి మంచినీళ్ళు త్రాగివచ్చి మళ్ళీపడుకున్నాడు.... కానీ ఎంతకూ మళ్ళీ నిద్రపట్టలేదు.... ఒళ్ళంతా నొప్పులతో- జ్వరం తగిలినట్లు అనిపించింది.

ఎలాగో తెల్లవారింది....

ఆఫీసుకు శలవుపెట్టేశాడు.... సీతానగరం వెళ్ళాలనివున్నా ఒంట్లో శక్తిలేదు.... అలా వూరువెళ్ళిపోయి- నీరజకు గుణపాఠం చెప్పాలని అనుకున్నాడు శేఖరం.... కానీ ఎక్కడో ఆశమిణుక్కుమంది- 'ఒకవేళ నీరజ వస్తుందేమో, ఆమె తొందరపాటుకు క్షమార్పణ చెప్పుకుంటుందేమో'- అని.... మళ్లీ ఆ ఆలోచనకు తనకుతానే నవ్వుకున్నాడు.

ఒకసారి___

ఒకేఒక్కసారి నీరజ శేఖర్ 'రూమ్'కి వెళ్ళింది.

"ఇంకెప్పుడూ ఇలా ధైర్యంచేసి రావద్దు నీరజా!....

ప్లీజ్.... అర్థం చేసుకో!.... కావాలంటే నేనే మీ యింటికి వస్తాను.... అయినా ప్రతిరోజూ ఆఫీసులో కలుసుకుంటూనే వున్నాంకదా!" అని ఇంకా శేఖరం ఏదోఅనబోతోంటే చటుక్కున లేచి వెళ్ళిపోయింది నీరజ....

అప్పటినుంచీ మళ్ళీ ఎప్పుడూ శేఖర్ రూమ్‌కి నీరజ రానే లేదు.... మరి ఇప్పుడుమాత్రం వస్తుందన్న నమ్మకం ఏదీ?"....

అసలు తాను ఆరోజున నీరజతో అలా ఎందుకన్నాడు?.... పెళ్ళికాకుండా ఒంటరిగా వున్న తనగదికి ఆమెవస్తే, చూసినవాళ్ళు నలుగురూ ఏమనుకుంటారో అని తాను అనుకున్నాడు.... ఆ పరిస్థితిని నీరజ అర్థంచేసుకుంటుందని అనుకున్నాడు.

"నిజంగా ఇప్పుడు నీరజవస్తే ఎంతబాగుండును?"- అనుకున్నాడు. అతనికెందుకో నీరజపిలుస్తున్నట్టే భ్రమకలుగుతోంది.... ఆమె పిలుపులు అతనిలోని అణువణువులోనూ నిండిపోయి, ఉండి ఉండి మధురాతిమధురంగా అతన్ని పలుకరిస్తున్నాయి.

చటుక్కున మంచంమీద లేచి కూర్చున్నాడు.... మనసంతా నీరజ ఇంటివైపే లాగుతోంది....మళ్ళీ అంతకుముందురోజు పబ్లిక్ గార్డెన్‌లో జరిగిన సంఘటన అతనికళ్ళముందు మెరుపులా ఓసారి మెరిసింది....

నీరజను నొప్పించటం భావ్యంకాదనీ_ఆరోజు గార్డెన్స్‌లో- ఆమెను కలుసుకున్నప్పుడు, తా నామెను పెళ్ళిచేసుకోబోతున్నట్లు చెప్పాలనీమనస్ఫూర్తిగా అనుకున్నాడు. అయినా, తానుఎకౌంట్స్ పరీక్షకు చదువుతూండటంవల్ల ఇన్నాళ్ళూ ఆ ప్రస్తావన తాను తీసుకరాలేదు.... ఆ పరీక్ష పాసయ్యాడు కనుక, ఇక తాను పెళ్ళి చేసుకొని జీవితంలో స్థిరపడవచ్చు.... ఆ విషయాలే, అన్నీ వివరంగా గార్డెన్స్‌లో నీరజ కలుసుకున్నప్పుడు మాట్లాడాలనుకున్నాడు.

కానీ చివరకు ఫలితం ....?....

తను ఏమీ మాట్లాడకుండానే - ఏవేవో మాటలు ఆవేశంగా అనేసి వెళ్ళిపోయింది నీరజ.

తలచుకుంటున్న కొద్దీ శేఖరం గుండెలు చెప్పలేని ఆవేదనతో మెలితిరిగిపోతున్నాయి.

* * * *

నీరజ రెండురోజులనుంచీ ఎంతో ముభావంగా వుండటం శ్రీనివాసరావుగారు గమనించి ఖంగారుపడ్డారు.

"ఏమ్మా నీరూ? అలా వున్నావేమిటీ?.... వంట్లో బాగా లేదామ్మా" -ఎంతో ఆప్యాయంగా అడిగారు ఆయన.... ఆ పలకరింపుతో, నీరజ గుండెల్లో పేరుకున్నదిగులు కరగి కన్నీరుగా మారింది.

"ఎందుకమ్మా?....ఏమయింది?....పోనీ శేఖరాన్ని రమ్మని కబురుపంపనా?....ఇద్దరూ అలా సినీమాకువెళ్ళి వద్దురుగానీ"-

"నాన్నా!....శేఖరాన్ని....మర్చిపొండి నాన్నా...."- ఏడుస్తూ తనగదిలోకి వెళ్ళిపోయింది నీరజ....తలగడలో తలదూర్చి, కన్నీరంతా ఇంకిపోయేదాకా ఏడ్చింది.

* * * *

నీరజ, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసింది .... ఇరవైనాలుగు గంటలూ సూన్యంలోకి చూస్తూ గడిపేస్తోంది. కూతురి పరిస్థితి చూసి కృంగిపోయారు శ్రీనివాసరావుగారు.

"శేఖరానికీ, నీరజకూ మధ్య ఏవో మాట పట్టింపులు వచ్చి వుంటాయి. అవి మామూలే! .... ఒకవేళ నీరజను పెళ్ళి చేసుకోవటం శేఖరానికి ఇష్టంలేదేమో? .... ఏమైనా నీరజతో మాట్లాడితేగానీ ఏ విషయం తేలదు" — అని మనసులోనే అనుకుంటూ నీరజ గదిలోకి వెళ్ళారు శ్రీనివాసరావుగారు.

నీరజ గుండెలమీద తెరచి వుంచిన పుస్తకం ఏదో బోర్లించి వుంది. ఆమె తదేకంగా సీలింగ్‌ఫాన్‌వైపు చూస్తోంది. మనిషి ాగా చిక్కింది .... మొహంలో కాంతి కనిపించటంలేదు.

నేలమీద పాకితే, పచ్చని మోకాళ్ళు ఎక్కడ మాసిపోతాయోనని వెల్వెట్ బట్టమీద వదిలేవారు. అనిల్‌నూ, నీరజనూ - పసివాళ్ళుగా వున్నప్పుడు! .... వారి సౌభాగ్యం అంతా తుడి

పెట్టుకపోయిన రోజుకూడా నీరజ ఇంతగా క్రృంగిపోలేదు.

పక్కలో కూర్చుని నీరజ తల నిమురుతూ - కాసేపు అలాగే వుండిపోయారు శ్రీనివాసరావుగారు. చాలా కాలం తర్వాత మళ్లీ నీరజ కళ్ళల్లో నీటిపొర కదిలి - మరుక్షణంలో ఇంకి పోయింది. దాని స్థానంలో - తెలియని కోపమేదో చోటు చేసు కుంది.

"చూడుతల్లీ .... ఇలా ఎన్నాళ్లని బాధపడతావ్? .... అయినా ఆ భగవంతుడు ఎవరికి ఎవర్ని రాసిపెట్టాడో ?...."

"హుం .... భగవంతుడు !" భగవంతుడున్నాడా? .... లేడు! .... ఉన్నా రాతి విగ్రహమే!" — నీరజలో కోపం బుసలు కొట్టసాగింది.

శ్రీనివాసరావుగారు నిట్టూర్చారు.

"చూడమ్మా! .... మురళీకృష్ణ నిన్ను చేసుకోవాలను కుంటున్నాడు. రాజారామ్‌చేత పదే పదే కబురుపెడుతున్నాడు!.... ఏమంటావ్?" —

"మీ ఇష్టం నాన్నా!" —

ఆ సమాధానం నీరజనుంచి అంత త్వరగా వస్తుందని శ్రీనివాసరావుగారు ఆలోచించలేదు. అందుకే, నీరజ జవాబు వినగానే ఎంతో పొంగిపోయారు. భార్య మహాలక్ష్మమ్మ జ్ఞాపకానికి వచ్చిందాయనకు.

"లక్ష్మీ! .... మన నీరూకి పెళ్ళి .... నువ్ కలలుకన్నట్లు ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూవేసి చేయలేకపోయినా - ఏ లోటూ రాకుండా పెళ్ళి చేస్తాన్లే! .... నువ్ వుండి వుంటే ఎంత బాగుండేదీ?" - శ్రీనివాసరావుగారు దుఃఖమో, ఆనందమో తెలియని అనుభూతుల మధ్య ఊగిపోయారు.

మురళీకృష్ణ నీరజకు బాగా తెలుసు.... తన ఆఫీసులోనే ఒక సెక్షన్ ఆఫీసరుగా వుంటున్నాడు.... అతనంటే నీరజకు ఏలాంటి అభిప్రాయమూ లేదు.... ఎప్పుడైనా తాను కనిపిస్తే పలక రించేవాడు.... ఎందుకనో సరిగ్గా సమాధానం చెప్పేది కాదు.

అలాంటిది ఇపుడు ఎలా అతన్ని పెళ్ళి చేసుకుంటానన్నదో ఆమెకే అర్థంకాని పరిస్థితిలోవుంది.

ఏమైనా తన పెళ్ళి మరొకరితో జరిగిపోవాలి?.... అప్పటికి గానీ తనకు శేఖర్ మీద కసితీరదు.... శేఖర్ పోగొట్టుకున్నదేమిటో శేఖర్ కి తెలిసిరావాలి. అతనికి ఆ శిక్ష వేయాలంటే తాను ఎవర్నో ఒకర్ని పెళ్ళిచేసుకోవాలి!.... తప్పదు.... ఆ ఎవరో ఒకరు మురళీ కృష్ణ అయినా తనకు అభ్యంతరం వుండదు.... అంతే!

* * * *

పందిట్లో బాజా భజంత్రీలు చెవులు హోరెత్తేలా మోగుతున్నాయి.... అవి వింటూనే వణకిపోయింది నీరజ.... తన గుండెల మీద ఎవరో బాదుతున్నట్లూ - గుండెల్లో ఉరుములూ - పిడుగులూ వర్షిస్తున్నట్లూవుంది.... ఆఫీసువాళ్ళందరూవచ్చి అభినందిస్తున్నారు. నారాయణ ప్రత్యేకంగా అభినందనలు తెలియచేశాడు.

కానీ శేఖరం రానేలేదు.

శేఖరం గురించి నారాయణను అడగాలనుకుంది నీరజ.... అంతలోనే ఎవరో పిలిచేసరికి నారాయణ అక్కడనుంచి వెళ్ళిపోయారు.

తనమూలంగా మనసు కలతచెందిన శేఖరం నెలరోజులు శలవుపెట్టి సీతానగరం వెళ్ళిపోయాడని నీరజకు తెలియదు.

పెళ్ళిపీటలమీద, తన ప్రక్కన శేఖరమే కూర్చున్నాడేమో అని క్షణం భ్రాంతికిలోనై - ప్రక్కకు చూసింది - మురళీకృష్ణ మనోహరంగానవ్వి, ఆమె కళ్ళలోకి చిలిపిగా చూశాడు.... గభాల్న కాటుక రెప్పల్ని క్రిందికి వాల్చేసింది.

ఆ తరువాత - ఏదోసందర్భంలో ఒకటి రెండుసార్లు మురళీకృష్ణ అతని భుజాన్ని నీరజ భుజానికి ఆన్చినపుడు - ఆ స్పర్శకు తన వంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్లనిపించి కాస్త ఎడంగా సర్దుకొని కూర్చుంది. అయినదానికీ కానిదానికీ ఆమెను పలకరిస్తూ తాకుతూంటే, నీరజకు ఎక్కడికైనా దూరంగా 'పారిపోవాలని పించింది.

అప్పుడే, నీరజ మొదటిసారిగా పశ్చాత్తాప పడింది.... 'చేజేతులా స్వర్గాన్ని జారవిడుచుకుని - కోరి ఈ నరకంలోకి దిగి పోయానా' అనుకుంది.... అలా అనుకుంటూంటే, క్రమంగా శేఖరంమీద కసికరగిపోయి గుండెలనిండా దుఃఖం పూడుకపోయింది.

ఆ మర్నాడు- నీరజకువచ్చిన ప్రెజెంటేషన్స్ చూస్తున్నారు శ్రీనివాసరావుగారు.... అవి చూసినతరువాత- ఇంకా అవసరమైన వాటినికొని నీరజకు ఇవ్వాలని ఆయన ఉద్దేశ్యం.... మురళీకృష్ణ ముందుగదిలో స్నేహితులెవరితోనో మాట్లాడుతున్నాడు.... నీరజ మాత్రం- అక్కడవున్న సోఫాలో కళ్ళుమూసుకుని- ఆలోచిస్తూ కూర్చుండిపోయింది....

అంతలోనే- హఠాత్తుగా, అక్కడకు నారాయణవచ్చాడు.... అతనిచేతుల్లో ఏదో పేకెట్ వుంది....

"హల్లో"— పలకరించాడు నారాయణ.

నీరజ కళ్ళుతెరచి అతనివైపు ఒకసారి నిర్లిప్తంగా చూసి "కూర్చో నారాయణా!" అంది. ఆమెవైపు తీక్షణంగా చూసి - మళ్లీ మామూలుగా అయిపోయి చేతిలోవున్న పేకెట్‌ను నీరజ అందించాడు.... సోఫాలో సరిగ్గాకూర్చుని- దానివైపుచూస్తూ వుం పోయింది నీరజ- ఆ పేకట్‌పైన- తనకు చిరపరిచితమైన దస్తూ 'సౌభాగ్యవతి నీరజకు వివాహకానుక' ... వేళ్ళతో ఆ అక్షరాలమీద రాస్తూండి పోయింది.

"శేఖరానికి మీ వివాహ శుభలేక అందిందట! వారంరోజుల క్రితంవచ్చి, ఈ కానుక మీకు అందచేయమని ఇచ్చి మళ్లీ శీత నగరం వెళ్ళిపోయాడు.... మరోనెల శెలవు పొడిగిస్తున్నట్లు చెప్పాడు"- అన్నాడు నారాయణ.

తాను కూర్చున్న సోఫాతోసహా భూమిలోకి దిగిపోతున్నట్లు అనిపించింది నీరజకు ... వణికేచేతులతో ఆదుర్దాతో పేక విప్పింది.... ఎర్రని కాగితాలలో ఒక అట్టపెట్టెవుంది. అందుల మళ్లీ నీలిరంగు మఖమల్ పెట్టె!.... దాని మూతతీసిచూసిన నీర ఉలిక్కి పడింది.... స్నిగ్ధధవళ కాంతులతో మెరిసిపోతున్న పా

ఎప్పటికీ మీకేమీకా

రాతి తాజ్‌మహల్ అది !....

అది చూడగానే- ఆమె గుండె గుభేలుమంది.... గతంలో జరిగిన ఓ సంఘటన ఆమెకు గుర్తుకొచ్చింది.

ఒకసారి ఆఫీసుపనిమీద ఢిల్లీ వెడుతూ—

'ఢిల్లీనుంచి నీకు ఏం తెచ్చిపెట్టమంటావ్ నీరజా'- అని అడిగాడు శేఖరం.

'పాలరాతి తాజ్‌మహల్ తీసుకొస్తావా?-అని అడిగింది తను.

"వద్దు నీరజా! అదిమాత్రం కోరుకోకు! విధి విడదీసిన ప్రేమికుల చిహ్నం అది !.... కోరికలకూ, మమతలకూ - ప్రేమలకూ శాశ్వితంగా కట్టిన సమాధి అది !...."—అన్నాడు శేఖరం.

అలాంటిది ఆ శేఖరమే తనకిపుడు తాజ్‌మహల్‌ను బహుమతిగా పంపించాడు.... ఇక శేఖరం తనకేమీ కాడు !....అంతే !! దోసిట్లో ముఖం కప్పుకొని - వెక్కి వెక్కి ఏడ్చింది నీరజ.

తనసానుభూతిని మనసులోనే దాచుకుని - నెమ్మదిగా బయటకు వెళ్ళిపోయాడు నారాయణ.

నారాయణఅంటే మురళీకృష్ణకుకూడా చాలాఇష్టం....అసలు స్వతహాగా నారాయణ స్నేహశీలి.... అందుకే అందరూ అతన్ని ప్రేమిస్తారు.... తాను నవ్వుతూ ఎదుటివాళ్ళను నవ్విస్తాడు.... అందరితోటి కలుపుగోరుతనంగా వ్యవహరిస్తాడు.... ఒకరివిషయం మరొకరికి ఎప్పుడూ చెప్పడు.... అందరిఅంతర్యాలు ఇట్టే తెలుసుకుంటాడు.... కానీ తెలియనట్టే వుండిపోవటం అతనిలోని ప్రత్యేకత.... అందరూ అతనినుంచి సలహాలు కోరతారు.... అందుకే నీరజపెళ్ళిపనుల్లోకూడా శ్రీనివాసరావుగారికి కుడిభుజంలా వ్యవహరించాడు....

ఆ రోజంతా - షోకేస్‌లోవుంచిన తాజ్‌మహల్‌నే చూస్తూ గడిపింది నీరజ.

రాత్రి.... మొదటి రాత్రి....

గదిలో కాలుపెట్టిన నీరజ చటుక్కున ఆగిపోయింది.... గదంతా అగరువత్తుల సువాసన గుబాళిస్తోంది. ఆతురతగా చుట్టూ

చూసింది.... తన మంచంపైనున్న మురళీకృష్ణను చూడగానే - భయంతో వణికిపోయింది.

నీరజవైపు చిలిపిగా - కాంక్షతోచూస్తూ - దగ్గరకురమ్మని కళ్ళతోనే పిలిచాడు మురళీకృష్ణ.... కానీ నీరజ భయంతో అడుగు కదపలేక పోయింది.

అతను నీరజదగ్గరగా వచ్చాడు.... తమకంతో, బిగ్గరగా కౌగలించుకున్నాడు. గొంగళిపురుగు మీదపడినట్లు గభాల్న అతన్ని విదిలించుకుంది నీరజ.

"చూడండి!.... మీరంటే ఎందుకో మొదట్నుంచీ నాకు గౌరవం లేదు!.... దయచేసి దూరంగా వుండండి.... నన్ను తాకటానికి ప్రయత్నించకండి"- అంది కటువుగా- నిశ్చలంగా.

మురళీకృష్ణ నిశ్చేష్టుడయ్యాడు.

తానంటే నీరజ ఎందుకలా ప్రవర్తిస్తోంది?.... అసలుతనను ఎందుకు పెళ్ళిచేసుకుంది?.... అయినా తనలో ఏమీ లోపాలులేవే: తనకు చదువుంది, సంస్కారముంది.... వాటితోడు అందంకూడా వుంది.... కాలేజీలో చదివేటప్పుడు ఎంతోమంది అమ్మాయిలు కావాలని తనచుట్టూ తిరిగేవారు!....మరి తనపట్ల నీరజకు గౌరవం లేకపోవటానికి కారణం ఏమైవుంటుంది?.... తలచుకుంటున్న కొద్దీ అతని కాళ్ళక్రింది నేల కదిలినట్లనిపించింది.

మరేమీ బదులు చెప్పకుండా- వెళ్ళి మంచంమీద మౌనంగా పడుకున్నాడు.

నీరజ, అక్కడేవున్న సోఫాలో పడుకుంది.

ఆ మొదటిరాత్రి వారికి ఎలాంటి మధురానుభూతిని మిగల్చకుండానే, గడచిపోయింది.

* * * *

తెల్లవారగానే- మురళీకృష్ణ శ్రీనివాసరావుగారి దగ్గరకు వెళ్ళాడు.

"మీకు నిన్ననే చెప్పాలనుకున్నాను!.... ఆఫీసు పనిమీద ఈరోజే బొంబాయి వెడుతున్నాను.... అటునుంచి గోవాకూడా

ఎప్పటికీ మీకేమీకాన

వెళ్ళాలి!.... నేను తిరిగివచ్చాక మీ అమ్మాయిని మా యింటికి తీసుకెళతాను...."— అన్నాడు, ఎటువంటిభావాల్నీ ముఖంలో కనిపించనీయకుండా.

"అంతకంటేనా బాబూ! ఇప్పుడే నువ్ తీసుకెళ్ళిపోతావేమో నని బెంగపెట్టుకున్నాను.... మరికొన్నాళ్ళు నాదగ్గర వుంచుకుందుకు అవకాశం ఇచ్చావ్... అంతేచాలు.... నాకుఅదేతృప్తి"-అన్నారు శ్రీనివాసరావుగారు తేలికపడినమనసుతో.

ఆరోజే మురళీకృష్ణ వెళ్ళిపోయాడు.

నీరజ తేలిగ్గా గాలి పీల్చుకుంది.

* * * *

నీరజ 'గుడ్ బై' చెప్పేసిన తరువాత - మానసికంగా కృంగి పోయిన శేఖరం, ఆఫీసుకు శలవుపెట్టేసి - గంపెడు దిగులుతో శీతానగరం చేరుకున్నాడు. ఇంట్లో కాలుపెట్టేసరికి - తనను అంత అర్జంటుగా భగవంతుడు అక్కడికు తీసుకొచ్చిన కారణం ఏమిటో అతనికి తెలిసి వచ్చింది.

రామ్మూర్తిగారు - మంచంలో ఇప్పుడో అప్పుడో అన్నట్టున్నారు.

"బాబాయ్‌గారూ! నేను శేఖరాన్ని!.. వచ్చేశాను.... ఒక్కసారి కళ్ళు తెరచి చూడండి" - అంటూ వాపోతున్న శేఖరాన్ని చుట్టుకొని - చిన్నపిల్లలా విలపించింది వర్ధనమ్మ.

కర్తవ్యం గుర్తుకొచ్చిన శేఖరం- ఆమెను ఊరడించటానికి ప్రయత్నం చేశాడు. గోపాలంకోసం - అతనికళ్ళు నాలుగు మూలలా వెతికాయి. గోపాలం ఆ గదిలో కనిపించలేదు. గోడ కానుకొని విచారంగా నుంచునివుంది గోపాలం భార్య.

శేఖరం లేచి పెరట్లోకి వెళ్ళాడు. అక్కడి అరుగుమీద మోకాళ్ళమధ్య తలదూర్చుకుని ఏడుస్తున్న గోపాలం కనిపించాడు. అతని ప్రక్కనే కూర్చుని, మృదువుగా వీపు నిమురుతూ 'గోపాలం' - అని పిలిచాడు.... ఒక్కసారి తలతిప్పి-శేఖరాన్ని చూడగానే, అతన్ని వాటేసుకొని - వెక్కి-వెక్కి ఏడ్చాడు గోపాలం.

అతన్ని ఓదార్చి —

"బాబాయ్‌గారు ఇంత సీరియస్‌గా వుంటే - నాకు ఒక టెలిగ్రాం ఇవ్వాలనయినా తోచలేదా ?" - అన్నాడు.... అతని కంఠంలో నిష్ఠూరం, బాధ వినిపించాయి.

"నిన్న సాయంత్రం నాకోసం మనిషి వచ్చేదాకా నాకూ తెలియదు ! నేను రాత్రికి వచ్చాను. రాత్రే నీకూ, హరితకూ టెలిగ్రాములు ఇచ్చాం.... బహుశా అది నీకు అందకముందే బయలుదేరి వచ్చివుంటావ్.... రాత్రంతా నాన్న నిన్నే పలవరించారు" - గోపాలం గొంతులో ఏదో బాధ సుడులు తిరుగుతోంది.... రెండు నిముషాల భయంకర నిశ్శబ్దం తరువాత - మళ్లీ గోపాలం అన్నాడు.

"నన్ను క్షమించు శేఖర్ !.... ఇంతవరకూ నాన్న ఎలా జీవితాన్ని గడుపుతున్నారన్నది నే నెప్పుడూ ఆలోచించలేదు.... ప్రతినెలా జీతం రాగానే నువ్ డబ్బు పంపుతున్నావని రాత్రే నాకు తెలిసింది. కన్నకొడుకునైనా, నేనుమాత్రం ఏమీ పట్టించుకోకుండా వుండిపోయాను.... తలచుకుంటూంటే, నే నెంత కృతఘ్నుడినో అర్థమవుతోంది.... నువ్... నువ్‌మాత్రం దేవుడివి శేఖరం !"

గోపాలాన్ని తీసుకొని రామ్మూర్తిగారి గదిలోకి వెళ్లాడు శేఖరం. అక్కడ స్పృహ కోల్పోయిన వర్ధనమ్మగారిని చూసి ఎంతో బాధపడ్డాడు శేఖరం.... ఎన్నో సంవత్సరాలుగా కలిసి భార్యాభర్తలుగా స్నేహితుల్లాగా గడిపిన ఆ జంటను భగవంతుడు వేరుచేయబోతున్నాడా ?

"భగవాన్ ! సృష్టి ఎంత చిత్రమైనది.... ఏదో ఒకరోజు కాలగర్భంలో కలసిపోతామని తెలిసికూడా - ఎన్నికోరికలు.... ఎంత మాయ ?" — కొనవూపిరి అనంతవాయువుల్లో కలసిపోయిన మరుక్షణం ఎవరికి ఎవరు ?

సాయంత్రానికి, హరిత, నరేష్ వచ్చారు. హరిత దుఃఖం చెప్పనలవి కాదు.... ఆ రాత్రి ఒక్కసారి బాగా తెలివి వచ్చింది

ామమూర్తి గారికి.... మంచంచుట్టూ చూసిన ఆయన చూపులు శేఖరంమీద నిలచిపోయాయి. ఆ కళ్ళల్లో ఏదో తృప్తి - ఒక్కసారి మెరుపులా వెలిగింది.... ఆయన చేతిని తన చేతుల్లోకి తీసుకుని - నిమురుతూ - పక్కనే కూర్చున్నాడు శేఖరం.

"బాబూ !" - అన్నట్టుగా ఆయన పెదవులు అస్పష్టంగా కదిలాయి. శేఖరంలేచి - ఆ మంచం ప్రక్కన - కాళ్ళమీద తల వాల్చి సగం మగతలో వున్న వర్ధనమ్మగారిని లేపి - భర్త దగ్గరకు తీసుకెళ్ళాడు. రామ్మూర్తిగారు, అతి కష్టంమీద ఆమె చేతిని అందుకొని, శేఖరం చేతుల్లోపెట్టి - శాశ్వితంగా కన్ను మూసారు.

ఘొల్లుమన్నారు అందరూ.... ఆయనమీద విరుచుకుని పడిపోయిన వర్ధనమ్మగారు మరి లేవలేదు. అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు.... "ఎంత పుణ్యాత్మురాలూ ?" - అని ఆశ్చర్య పోయారు.

శేఖరం తన చేతికేసి చూసుకున్నాడు.

"ఈ చేతిని పట్టుకొని వదిలేసింది నీరజ !.... ఇప్పుడు ఈ చేతిలోంచి జారిపోయింది మాతృమూర్తి వర్ధనమ్మ ! .... ఈ చేతి ఆసరా ఇంక ఎవరికీ అవసరం వుండదు...." — తలచు కుంటున్నకొద్దీ గుండెలు బ్రద్దలవుతున్నాయి శేఖరానికి.

రామ్మూర్తీ వర్ధనమ్మగార్లకు - దహన సంస్కారాలు - పెళ్ళి జరిగినట్లుగా - జరిగిపోయాయి. శవయాత్రకు ఊరు ఊరంతా కదలి వచ్చింది.

* * * *

తాను రాసిన ఒక నవలకు ఫస్ట్‌ప్రైజు వచ్చినట్టుగా టెలి గ్రాం వచ్చింది నారాయణవద్దనుంచి.... ముందు ఆ టెలిగ్రాం ఆఫీసుకు వచ్చింది. అదిచూసి నారాయణ వెంటనే సీతానగరం టెలిగ్రాం ఇచ్చాడు.

ఎవరు సంతోషించాలి ?.... రామ్మూర్తిగారి ఆప్యాయతా. ఆత్మీయతా తల్చుకొని కుమిలిపోయాడు శేఖరం.

ఆ సాయంత్రం హరితను పిలిచాడు.

"హరితా!.... నీకు జ్ఞాపకంవుందా?.... ఓసారి కథల పోటీకి ఓకథ పంపకూడదా అనిఅడిగావ్!.... నేనంత పెద్దవాడ్ని కాదు అన్నాను.... పోటీకి పెద్దవాళ్ళే రాయాలా అని మళ్ళీ నువ్ అడిగావ్.... ఇప్పుడుచూశావా.... నేనెంత పెద్దవాడ్నిఅయ్యానో! నా నవలకు 'ఫస్ట్‌ప్రైజు' వచ్చింది- అంటూ ఆ టెలిగ్రాం ఆమెకు ఇచ్చాడు.... అది చూస్తూ వుండిపోయింది హరిత.

"బహూమతి డబ్బు అయిదువేలు వస్తుంది.... ఆ అయిదు వేలుపెట్టి నీకునచ్చిన నగలుచేయించుకో...."—

అప్పటికే కుమిలి కుమిలి లోలోపల దుఃఖిస్తున్న హరిత- ఇక దాచుకోలేకపోయింది.

"వద్దు శేఖరం! నా పెళ్ళికోసం- నాన్నకోసం- ఇప్పటికే నువ్ మాకు ఎంతోచేశావ్.... ఇంకా నాకేంకావాలి?.... వద్దు!.... అయినా నీకుమాత్రం అవసరాలుండవా? డబ్బంతా ఖర్చుపెట్టేస్తే రేపు నీరజ వదినకు ఏం పెడతావ్?"—

అయ్యో హరితా! ఇంకెక్కడి నీరజ!.... నారాయణ నిన్న రాసిన ఉత్తరంతో ఆ ఆశకూడా హరించిపోయింది...."— అని మనసులోనే అనుకుని - పైకిమాత్రం చిరునవ్వు ప్రదర్శించి-

"హరితా! నీకో వదినంటూ వచ్చినప్పుడు- నువ్ ఆమెకి ఏం చేయించమంటే అదే చేయిస్తాను.... ఈ డబ్బుమాత్రం నీదే!" అన్నాడు శేఖరం.

ఆతరువాత పదిరోజులకే హరిత, భర్తతో తిరిగి వెళ్ళి పోయింది.... గోపాలం ఇంటిబాధ్యత తీసుకున్నాడు.... శేఖరం కూడా హైదరాబాద్ వెళ్ళి- పెళ్ళికానుక కొని- నారాయణద్వారా నీరజకు పంపించాడు.... మళ్ళీ శలవు పొడిగించిన కారణంగా- తనను అక్కడనుంచి విశాఖపట్నం బదిలీచేసినట్లు తెలుసుకున్నాడు శేఖరం.... అదీ తన మంచికే ననుకున్నాడు!.... ఆ మర్నాడే ఆఫీసులో ఛార్జీ యిచ్చేసి విశాఖపట్నం వెళ్ళిపోయాడు!

* * * *

జీవితంలో తాను పొగొట్టుకున్నదేమిటో రానురాను నీరజకు తెలిసి వస్తోంది!.... మాటిమాటికీ గతస్మృతులు ఆమెను కలవర పెడుతున్నాయి.... శేఖర్‌తో గడిపిన అందమైన సాయంకాలాలూ- సుందరప్రదేశాలూ పదేపదేగుర్తుకొచ్చి- వ్యాకులపరుస్తున్నాయి.... ఇద్దరికీ నచ్చిన పాటలు రేడియోలో ఎప్పుడైనా వినిపిస్తుంటే మనసు బాధతో మెలితిరిగిపోతోంది.... ఆ పాటలు - వారిద్దరి గుండెల అంచులమధ్యా పదికాలాలపాటు పదిలంగా నిలిచిపోయే మధురభావనలు !!

చీకటిలో కిటికీవద్ద నిలబడి గంటలతరబడి - నిశీథంలోకి చూస్తూంటుంది. గాలిలో ఊగే చెట్లతలలు జుట్లు విరబోసుకున్న రాక్షసుల్లా కనిపించేవి.

, ఆకాశం అంచున శేఖరమే నిలబడి-చేతులుచాచి, "నీరజా- నీకోసమే నిరీక్షణ! రా నీరజా!"-అని ఎలుగెత్తి పిలుస్తున్నట్లు- కనిపించేది. ఎప్పుడైనా - పెరట్లోని కొబ్బరిఆకుల చివర వెన్నెల పడి మెరుస్తూంటే - అందమైన శేఖర్ పలువరసే జ్ఞాపకానికి వచ్చేది.... గులాబీరెక్కల్ని చూసినప్పుడు అతని ఎర్రనిపెదవులు గుర్తుకువచ్చేవి.... శేఖర్ జ్ఞాపకాలు వీడని నీడలా వెన్నాడు తూంటే - చివరకు శేఖర్ లేనిదే తాను బ్రతకలేననే నిర్ధా రణకు వచ్చేసింది నీరజ.

"శేఖర్! ఒక్కసారి నాకు కనిపించు!.... ఇంతటి శిక్ష నేను భరించలేకుండా వున్నాను. నీ రూపం కనిపించకపోయినా, ఇప్పుడు ఫోన్లోఅయినా నీ మాటలు వినాలని వుంది.... ఇక ఈ ప్రపంచాన్నీ మనుష్యుల్నీ లెక్కచేయను.... నాకోసం ఒక్కసారి మాయింటికి రా, శేఖర్! నీతో ఎన్నో విషయాలు మాట్లాడాలి!- నీ రాకకోసం వేయికళ్ళతో ఎదురు చూస్తూంటాను"- అని పది సార్లయినా మనసులోనే రిహార్సల్ చేసుకుని - ఆత్మాభిమానాన్ని చంపుకుంటూ - ఫోన్ చేసింది నీరజ, ఆఫీసుకు.

శేఖరం, విశాఖపట్నం బదిలీఅయి వెళ్ళిపోయాడని ఎవరో చెప్పారు.... ఆ సంగతి వింటూనే కుప్పలా కూలిపోయింది నీరజ

రోజులు గడవటమే కష్టమైపోతోంది.... చీకటికీ వెన్నెలకూ

పగటికీ రాత్రికీ తేడాలేకుండా గడిపేస్తోంది.... గలగలా సుడులు తిరుగుతూ ప్రవహించే నది చటుక్కున ఆగిపోయింది.

కూతురివ్యథ అర్థంకాక లోలోపలే కృంగిపోతున్నారు శ్రీనివాసరావుగారు.

* * * *

విశాఖపట్నంలో ఒంటరిగానే - రోజులు గడిపేస్తున్నాడు శేఖర్.... స్నేహితులుగానీ, ఆత్మీయులుగానీ అక్కడ అతనికెవరూ లేరు. ఎవర్నీ దగ్గరకు చేర్చుకోలేదు.... అతని విచిత్రమైన మనస్తత్వానికి తోటి ఉద్యోగులు మొదట్లో ఆశ్చర్యపోయినా - క్రమంగా అతని ధోరణి వాళ్ళకు చిరపరిచితమయిపోయింది.

అతని నిజమైన నేస్తం విరిగిపడే సముద్రకెరటం!.... చాలాతరచుగా, సముద్రఘోషతో, తనఘోష చెప్పుకునేవాడు. అప్పుడప్పుడు చెలరేగే పెనుతుఫానుకు, చెలియలికట్టలా - అదుకునేది సముద్రం. అందుకే ఎక్కువగా - సాయంత్రంపూట సముద్రపు ఒడ్డుకు వెళ్ళిపోయేవాడు. నీరజకు ఇష్టమైన పాటలు గొంతెత్తి పాడుకునేవాడు. రానురాను ఇప్పుడు తనగొంతు బాగ పలుకుతోంది. ఆరోజుల్లో నీరజ పక్కన కూర్చుని పాడుతూంటే ఏదో తెలియని ఉద్వేగం గొంతు పట్టేసేది!.... ఫ్రీగా, బాగా పాడలేక పోయేవాడు!.... ప్రతిసారీ ఇంకా బాగా పాడాలనే ప్రయత్నించేవాడు.

అలా, అప్పుడు తానుపాడుతూంటే, తన పెదవుల కదలికను - కళ్ళు పెద్దవి చేసుకొని మరీ చూసేది నీరజ. మనసంతా గిలిగింతలుపెట్టి పాట సరిగా పాడలేక పోతున్నానేమో అనుకునేవాడు. అయినా ఆపాటకే నీరజ పరవశించి పోయేది. "మరి ఇప్పుడు వింటే ఎంత ఆనందించేదో" అనుకునేవాడు.

"హుఁ! ఇంక నీరజ తనపాట వినటంకూడానా ?.... అసంభవం. ఆ అధ్యాయం అంతటితో సమాప్తమయిపోయింది. అంత తొందరపాటూ - ఆవేశమూ వున్న నీరజతో, అసలు తానింత దూరం రాకుండా వుండవలసింది!.... ఆమెనుంచి తనకింత

మానసికశాంతి లభిస్తుందనుకున్నాడు। ఎంత సేపూ - ఎమటిమని
తనకు సుఖాన్నీ శాంతినీ ఇవ్వాలనుకుని ఆశపడిన నీరజ - తన
ఏమాత్రమూ అర్థంచేసుకోలేక పోయింది।.

ఏది ఏమైనా - జరిగిపోయిందాన్ని మార్చటానికి - ఎవరి
సాధ్యంకానిపని।.... ఎక్కడున్నా నీరజ సుఖంగా వుండటమే తా
కోరుకోవలసింది।.... అంతే।

కానీ, ఆమెను ఎంత మరచిపోవాలనుకున్నా - అం
దృఢంగా, ఆమెరూపం అతనికళ్ళల్లో కదులుతోంది.

"నీరజా। నాకెందుకు దూరం అయిపోయావ్?....అందరిల
అన్నిభావాలూ పైకిచెప్పుకోలేక పోయినందుకే - నా కింత
శిక్ష విధించావా?.... నిజం ఏమిటో నీకు తెలుసు నీరజా।....
హృదయానికీ తెలుసు .... నీతోకూడా చెప్పవలసింది.... చెప్ప
టానికి ఇంకా సమయం ఉందనుకున్నాను. ఇంతలోనే సమస్తము
అంతరించిపోయింది. నన్నెంత అపార్థం చేసుకున్నావ్ నీరజా
ప్రతిరోజూ ఇలా ఏకాంతంగా కూర్చుని ఆకాశం వినేలా
నిన్ను నేను పిలుస్తున్నా - అందనంత దూరంలో వుం
పోయావ్...." - అదే అతని తపన.... అదే అతని ఆలాపన।

శేఖరం ఆరోగ్యం క్రమక్రమంగా క్షీణించటం మొదల
పెట్టింది.... రాత్రి ఎప్పుడోగానీ నిద్రపట్టేది గాదు. పట్టినా
చాలా కొద్దిసేపు మాత్రమే। .... చటుక్కున మెలకువ వచ్చేసేది
తక్కిన రాత్రంతా మళ్ళీ ఆలోచనలు।

అప్పుడప్పుడు నిద్రలో మంచికలలు వచ్చేవి.... నీరజా-
తనూ, చక్కని సంసారం - అడపా దడపా పిల్లల అల్లరి -
ఆనందం - ఏవేవో కమనీయమైన కలలుకని, అవే నెమరువేసు
కుంటూ, మళ్ళీ కొత్తకలలు కనేదాకా వాటినే తలచుకుంటూ
రోజుల్ని గడిపేస్తున్నాడు శేఖరం।

* * * *

రాజారాం, ఒకరోజు నీరజను కలుసుకున్నాడు.

"నీరజాదేవిగారూ। మీకు నేను చెప్పగలిగినవాడ్ని కాదు...

నాకు మురళీకృష్ణ ఎంత సన్నిహితుడో మీకు తెలుసు!" మిమ్మల్ని చూసిన మరుక్షణంలోనే ప్రేమించాడు. ప్రేమంటే ఏమిటో తెలియని అతని అంతరంగం ప్రేమతో నిండింది.... నా మధ్యవర్తిత్వంలో - మీ వివాహం జరిగింది.... తీరా వివాహం అయిన తరువాత, అతని పంచరంగుల స్వప్నం చెదిరిపోయింది. మీరు మురళీకృష్ణపట్ల అంతటి విముఖత చూపించటానికి కారణం నాకు తెలుసు! కానీ మురళీకృష్ణకు తెలియవని నా ఉద్దేశ్యం.... ఏమైనా గతాన్ని మరచిపోయి, భవిష్యత్తును సుగమం చేసుకోవాల్సిన బాధ్యత ఇప్పుడు మీపైనే వుంది!.... ఛలాకీతనానికి మరోపేరులా వుండే మురళీకృష్ణ - ఇప్పుడు ఎలా అయిపోయాడో చూశారా? ఎప్పుడూ ఏదో పరధ్యానతో, ఏదో పోగొట్టుకున్నవానిలా, ఆలోచిస్తూనే వుంటాడు.... కళ్యాణవేదిక మీద మీ ఇద్దర్నీ నేనే కలిపాను!.... జీవిత భాగస్వాములుగా మిమ్మల్నిద్దర్నీ- దగ్గరకు తీసుకురావాల్సిన బాధ్యతకూడా నా మీదనే వుంది!.... నన్ను అపార్థం చేసుకోకుండా- మీ అన్నగా భావించి నా కోరికతీర్చండి.... మీ ఇంటికివెళ్ళి మీసంసారాన్ని చక్కబరచుకోండి!.... మురళీకృష్ణను మళ్లీ మనిషిని చెయ్యండి.... నీరజగారూ!.... చేతులు కాలకముందే- జాగ్రత్తపడమని- మీ శ్రేయోభిలాషిగా- చెబుతున్నాను" అన్నాడు రాజారాం ఆవేశంతో.

"రాజారాంగారూ!.... మీవత్తిడివల్లనే ఆరోజు ఆ విధంగా ముంచుకొచ్చింది.... లేకపోతే - ఇంకా కొన్నాళ్ళు ఆగి . లేదా జీవితాంతంవరకు ఆగి - శేఖరాన్నే - ఎప్పటికైనా చేసుకునేదాన్ని!.... లేదా అలాగే వుండిపోయేదాన్ని! మధ్యలో అనాలోచితంగా మీ మురళీకృష్ణకు ఆహూతి అయిపోయాను. నా జీవితం సర్వనాశనం అయిపోయింది"— అని అతనికి చెప్పాలనుకుంది నీరజ.... కానీ ఆమె మనసులోని ఆమాటలు గొంతువరకూవచ్చి ఆగిపోయాయి.

"క్షమించండి రాజారాంగారూ! ప్రస్తుతం నన్ను బాధించకండి.... కొన్నాళ్ళు నన్నిలా ఒంటరిగా వదిలేయండి.... మీకు పుణ్యం వుంటుంది...."— అంటూ ఎలాగో అనగలిగింది- కళ్ళ

లోకి ఉబికివస్తున్న కన్నీటిని బలవంతాన ఆపుకుంటూ- అక్కడ
నుంచి మరోగదిలోకి వెళ్ళిపోయింది నీరజ.

ఆ రాత్రి నీరజకు పూర్తిగా నిద్రరాలేదు ... శ్రీనివాసరావు గారు దగ్గుతూనేవున్నారు.... తన మనసులాగే, ఆయన ఆరోగ్యం కూడా ఈ మధ్య మరీ దెబ్బతింది.... రెండు మూడుసార్లు లేచి తండ్రికి మందూ, మంచినీళ్ళూ ఇచ్చింది.

"నువ్వింకా నిద్రపోలేదా తల్లీ"- అడిగారు శ్రీనివాసరావు గారు, రెండోసారి నీరజవచ్చి మందు ఇస్తూంటే.

'నిద్రమరచిపోయి చాలాకాలమయిపోయింది నాన్నా' అని సమాధానం చెప్పలేక- మాట్లాడకుండా- తండ్రికి సపర్యలుచేస్తూ తెల్లవారేదాకా, అలాగే వుండిపోయింది.

అప్పుడే- ఎంతో ఆలోచించిన తరువాత- ఒక నిర్ణయానికి వచ్చేసింది నీరజ.... దాంతో ఆమె మనసు ఎంతో తెలికపడింది

* * * *

"....డియర్ శేఖర్ !....

ఎవరా అని ఆశ్చర్యపోతున్నారా ? నేనే.... మీ నీరజను మీరు ప్రాణాధికంగా ప్రేమించిన మీ నీరజనే !.... ఎప్పుడు ముందు మాట్లాడేది నేనేగా ! ఎంతోకాలం తర్వాత - మళ్ళీ నేనే ముందుగా మీకు వుత్తరం రాస్తున్నాను.

నన్ను క్షమించగలరా శేఖర్ ?.... క్షమించమని అడిగే హక్కునుకూడా పోగొట్టుకున్నానుకదూ ! అయినా, మీరిప్పుడు నన్ను ఏమన్నా సహించే ఓర్పు పుష్కళంగావుంది. ఆ హక్కును ఏనాడూ నేను పోగొట్టుకోను. అందుకే స్థిరనిశ్చయంతో మీకు ఈ ఉత్తరాన్ని రాస్తున్నాను.

మీరింకా పెళ్ళిచేసుకోలేదని తెలిసింది !.... నిజమే... నాలా తొందరపాటు మనిషికాదు మీరు.... నామీద మీకున్న అంచంచలమైన ప్రేమకు ఇంతకంటే నిదర్శనం ఏంకావాలి అమృతభాండాన్ని తునాతునకలు చేసుకున్నాను. గతించినదానిని విచారించి లాభంలేదని తెలుసుకున్నాను. దైవం ఇప్పటికైనా

ళ్ళు తెరిపించాడు. మిమ్మల్ని చూడందే - మీ నవ్వును చూడందే
నీరజ బ్రతకలేదు. ఈ సహజాన్నీ - పరుషుల్నీ - ఎదిరించి-
బంధాలన్నీ త్రెంచుకొని - పరుగు పరుగున వచ్చి - మీ హృద
యంపై వాలి సేద తీర్చుకుంటాను. ఈ విషయంలో ఎవరు ఏమను
కున్నా లెఖ్ఖచేయదల్చుకోలేదు. ఈ సంఘం - భయపడిన కొద్దీ
భయపెడుతుంది. అందుకే మనకు ఈ సంఘంతో పనిలేదు. ఈ
రోజు పదమూడో తేదీ. ఇరవై అయిదో తేదీనాటికి మీ సాన్ని
ధ్యంలో వుంటాను. ఇక ఈ బంధాన్ని ఆ దేవుడుకూడా త్రెంచ
లేడు. అందుకే వచ్చేస్తున్నాను.

ఎప్పటికీ మీదాన్నే...

నీరజ ...."

ఉత్తరం చదువుకున్న శేఖరం గుండె లయ తప్పింది.
నిజంగా నీరజ తనకోసం వచ్చేస్తుందా? నీరజలేని జీవితం తనకూ
అంధకారంగానే వుంటోంది. నిజంగా నీరజ తనకోసం వచ్చేస్తే -
తన కంతకంటే అదృష్టం మరొకటివుందా? "నీరజ దూరమయితే
బతకలేనని" ఒకప్పుడు అనుకునేవాడు. కానీ ఎలాగో, జ్ఞాపకాలను
కెమరుపేసుకుంటూ - జీవచ్ఛవంలా - కాలాన్ని త్రోసుకొస్తున్నాడు
ఇన్నాళ్లా. నీరజవస్తే తన జీవితంలో మళ్ళీ వసంతమే వస్తుంది....
రతీకాంతిలా ఆమె తనతో వుంటానంటే అతని హృదయం
ఆనందంతో పరవశమైపోతోంది.... ఈసారి నీరజను ఏవిధంగానూ
నొప్పించకూడదనీ - మనసుకు నచ్చేవిధంగా చూసుకోవాలనీ
నిశ్చయించుకున్నాడు శేఖర్.

అంతలో ఏదో ఆలోచనవచ్చి క్షణకాలం అలాగే బిగుసు
కుని పోయాడు.

నీరజ వివాహిత!.... మరి వేదపండితుల సమక్షంలో,
వారి మంత్రాక్షతలతో జరిగిన వివాహం - బలహీనమై - చివరకు
ప్రేమబంధం జయిస్తోందా?.... ఏమిటో, నీరజ తనకు ఎప్పుడూ
అర్థంకాకుండానే వుంటుంది.... ఇన్ని అనర్థాలకూ మూలం ఆమె
కొంచరపాటేనా?.... కాదు.... ఆమె ప్రేమమూర్తి.... ఆమె తిరిగి

తనకు చేరువకావటమే తనకు కావలసింది!.... సంఘం ఏమను కున్నా తనకు నిమిత్తంలేదు.... నీరజ నిర్ణయం సరైనదే!... ఆమెను తోడుగా తీసుకుని - సంఘంలేనిచోటుకు, దూరతీరాలక వెళ్ళిపోవచ్చు.

అలా అస్తవ్యస్తంగా సాగుతున్న ఆలోచనలను బలవంతాన అణచుకుంటూ, తనకు వచ్చిన రెండవ ఉత్తరంతీసి చదవటం ప్రారంభించాడు.

"........గౌరవనీయులైన చంద్రశేఖరంగారూ ?"

మీకు జ్ఞాపకం వుండే వుంటాను.... నేను రాజారామ్ని! మీక ఈ నా డీలా ఉత్తరం రాస్తున్నందుకు అన్యథా భావించవద్దని మనవి.... మీరంటే మాకందరికీ ఎనలేని గౌరవం.... అందుకే ఒక ముఖ్యమైన విషయం వ్రాయగలుగుతున్నాను.... దయతో అర్థం చేసుకుంటారని నా నమ్మకం....

మురళీకృష్ణ జీవితంలోకి ప్రవేశించిన నీరజ అతనిని పూర్తిగా మార్చివేసింది.... ఒకవిధంగా వారి వివాహం నా ప్రోత్సాహం వల్లనే జరిగింది.... అందుకనే విచ్ఛిన్నమైన వారి కాపురం నిల బెట్టవలసిన బాధ్యత కూడా నాకు కొంతవుంది... మురళీకృష్ణ నీరజను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాడు... అందుకే అతన్ని అథోలోకంలోకి త్రోసేసి పుట్టింటిలోనే వుండిపోయింది నీరజ... అతని జీవితాన్ని నందనవనం చేయగల సామర్ధ్యం ఇప్పుడు మీకే వుందని నా నమ్మకం.... మీమాటంటే నీరజకు ఎంతో గౌరవమని నాకు తెలుసు.... ఆమె మనసు మార్చి, నచ్చచెప్పి - ఆమెన మంచిదారిలోకి నడిపించగల శక్తి మీ ఒక్కరికే వుంది! .... నిజా నికి మీకు వప్పగిస్తున్న ఈ బాధ్యత చాలా పెద్దదేననుకుంటాను... క్షమించండి! ... ఇంతకంటే గత్యంతరం కనిపించక - ఓ మంచి మనిషి జీవితం పతనమైపోతోంటే చూస్తూ ఊరుకోలేక రాస్తున్నాను ఇలా మీకు ఉత్తరం రాస్తున్నట్లు మురళీకృష్ణకు తెలియదు.

నిజానికి అతను ఇప్పుడు జీవచ్ఛవంలా రోజులు గడుపు తున్నాడు.... ఇంతకన్న వివరంగా రాయలేను.... నాభారాన్ని

మీకూ్కడా పంచి, నేనుకా_స్త తేలికపడుతున్నాను.

మీ మిత్రుడు,

రాజారామ్...."

ఉత్తరాన్ని చదవటం ముగించి - కళ్ళుమూసుకుని కుర్చీలో అలాగే కూర్చుండిపోయాడు శేఖరం.... గుండెల్లో సుడిగుండాలు తిరుగుతున్నాయి.... మూసిన రెప్పలక్రిందనుంచి ధారాపాతంగా కన్నీరు ప్రవహిస్తోంది.... చాలాసేపయిన తర్వాత - ఎలాగోలేచి, ఫ్లాస్కులోనుంచి కాఫీ వంచుకుని త్రాగి - గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూనే తీవ్రంగా ఆలోచించసాగాడు.... చివరకు ఓనిర్ణయానికి వచ్చి నీరజకు ఉత్తరం రాయటం మొదలుపెట్టాడు.

* * * *

"పోస్ట్,"

గుండెలు దడదడలాడుతూంటే.... పరుగునవెళ్ళి ఉత్తరం అందుకుంది నీరజ. 'ఎవరు రాశారమ్మా?' అని అడుగుతున్న శ్రీనివాసరావుగారికి సమాధానం చెప్పేస్థితిలోలేదు.... సరాసరి తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ ఉత్తరాన్ని విప్పకుండా టీపాయ్‌మీద వుంచి కాసేపు తదేకంగా చూస్తూండిపోయింది.... శేఖర్ వ్రాసిన వుత్తరం అది.... శేఖర్ ఏం రాశారో?.... రమ్మని రాశారా?.... ఇన్నాళ్ళ తన మనోవేదన, ఎడబాటులోని బాధ - అవన్నీ రాశారా?.... 'మన జీవితాల్లో మళ్ళీ మల్లెలు విరుస్తా'యన్నారా?.... ఇంకా ఎన్నో రకాల తలపోసుకుంటూ - ఆనందంతో - వణకుతున్నచేత్తో కవరు చించి, అందులోని ఉత్తరాన్ని తీసి చదవసాగింది నీరజ... ఎన్నో నెలలతర్వాత శేఖరంనుంచి మళ్లీ ఉత్తరం అందుకున్నందుకు ఆనందమో - ఆవేదనో తెలియదుకానీ, ఆమెకళ్ళకు సన్నని నీటిపొర అడ్డువచ్చి, అక్షరాలన్నీ అలుక్కుపోతున్నాయి.... కొంగుతోకళ్ళు అద్దుకుని - హృదయంలోని ఆత్రుతను అణచుకుంటూ చదువుకుంటోంది.

"నీరజా....

నీ ఉత్తరం అందింది.... మనసు పరవశించి సన్నాయి



ఎప్పటికీ మీకేమీకాను.

పాడింది.... నీవు నాకోసం వచ్చేస్తానంటే అంతకన్నా ఆనందం ఇంకేముంటుంది ? నీకోసం నా ఇంటితలుపులేకాదు–నామనసుతలుపు కూడా ఎప్పుడూ తెరచేవుంటాయి.... కానీ నా విషయం నీకు పూర్తిగా తెలుసు.... దేనికీ తొందరపడే రకాన్నికాదు !.... అన్నీ పక్కాగా వుండాలి !.... అప్పుడుగానీ నాకు తృప్తివుండదు.... అందుకని, నువ్ మురళీకృష్ణకు విడాకులు ఇచ్చిన తరువాత శాశ్వితంగా నా వద్దకు వచ్చేద్దువుగాని !.... అప్పుడు ఎవరికీ మనం భయపడవలసిన అవసరం వుండదు.... అందుకే ఆవేశ పడకుండా – నేను చెపుతున్నది జాగ్రత్తగా విను.

"వివాహమయిన తర్వాత భార్యాభర్తలకు పడకపోతే - రెండు సంవత్సరాలు పూర్తయితేనే కానీ - విడాకులకు కోర్టు అంగీకరించదు. ఇంకా ఆరు నెలలు వుంది దానికి.... కనీసం ఈ ఆరు నెలలైనా నువ్వు మురళీకృష్ణవద్ద వుంటేగానీ – విడాకులకు అవకాశం లభించదు.

"నువ్ అతనితో కాపురం చేసినట్టూ – మీ ఇద్దరికీ అభిప్రాయ భేదాలు వచ్చినట్టూ రుజువు కావాలి.... అప్పుడుగానీ చట్ట ప్రకారం విడాకులు తీసుకోవటానికి వీలుండదు.... నీకు ఇష్టంలేక పోయినా, వెంటనే మురళీకృష్ణవద్దకు వెళ్లి ఎలాగో, మిగతా ఆరు నెలలూ గడిపేయ్.... నా హృదయంలో నువ్వూ, నీ హృదయంలో నేనూ - శాశ్వితంగా ఉంటున్నాం నీకు అపవిత్రత అంటదు !" ఒకవేళ జరిగినా అది శరీరానికేగానీ ఆత్మకు కాదు.... నిండు మనసుతో నిన్ను నా దాన్నిగా స్వీకరిస్తాను.... బాగా ఆలోచించే ఇలా వ్రాస్తున్నాను. ఇందుకు నువ్ వప్పుకుంటే మన భావిజీవితం నందనవనమవుతుంది.... నా మాటను గౌరవిస్తావనే నమ్మకంతో–

నీ శేఖర్...."

ఉత్తరం పూర్తిగా చదివేసరికి – నీరజకు నిలువెల్లా చెమటలు పోశాయి. శేఖరం ఇలా రాశాడేమిటి ?.... తాను మురళీ కృష్ణ దగ్గరకు వెళ్ళటమా ?.... అతని సమీపంలో తాను సంచ రించటమా ?.... అసంభవం !....

అంతలోనే మళ్లీ మరో ఆలోచన....

శేఖరం తనమీద ఎంతో నమ్మకాన్ని వుంచి అలా చెయ్యమంటే కాదని అతని నమ్మకాన్ని వమ్ముచేయటమా?.... అసలు శేఖరం ఏది ఆజ్ఞాపిస్తే అది చేయటానికే తాను ఎంతోకాలంగా ఎదురు చూసింది. ఒక్కనాడైనా - "ఇలాచెయ్ నీరజా" - అని, అతనంటాడని ఎంతగానో ఎదురు చూసింది. ఇంతకాలానికి - భావిజీవితం నందనవనమయ్యే మార్గం చూపుతూ - అలా చెయ్యమంటే మానగలదా?

కానీ మురళీకృష్ణఇంట్లో ఆరునెలలు తాను ఎలాగడపాలి?.... తనకు భగవంతుడు ఇలాంటి పరీక్ష పెట్టాడేమిటి?"

నీరజ హృదయం తల్లడిల్లిపోతోంది.... ఎంతో సేపటికిగానీ, మనసును అదుపులోకి తీసుకరాలేక పోయింది.... చివరకు శేఖర్ చెప్పినట్టుగానే చేయటానికి నిశ్చయించుకుంది.

ఆ సాయంత్రం- శ్రీనివాసరావ్‌గారు గార్డెన్‌లో కూర్చున్నప్పుడు. నీరజకూడా ఆయన దగ్గరకు వెళ్ళింది.

"డాడీ!"

ఎంతకాలానికి ఆయన ఆ పిలుపు వినగానే- చిన్ననాటి నీరజా, అనిల్‌బాబూ, గోపీ, రాజయ్యా, అప్పటి భోగభాగ్యాలూ కళ్ళముందు మళ్లీ ఒక్కసారిగాకదిలాయి.... ఏదోవింతగా కూతురి వైపు చూశారాయన.

"ఏమిటి డాడీ.... అలా చూస్తున్నారూ?"....

"ఏం లేదమ్మా.... ఏవో జ్ఞాపకాలు...."

"నేను...."

"ఏమిటి తల్లీ?"—

"నేను ఆయనదగ్గరకు వెడతాను నాన్నా!"—

శ్రీనివాసరావుగారు, ఆమాట వినగానే ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యారు. ఎంతో ఆప్యాయంగా కూతురి తల నిమురుతూ-

"చాలా సంతోషం తల్లీ! ఇందాకా వుత్తరం వచ్చినప్పుడే అనుకున్నాను- మురళీకృష్ణే రాసి వుంటాడని!.... భార్యాభర్తల

మధ్యవచ్చే ఎడబాటెప్పుడూ శాశ్వతం కాదు తల్లీ!.... కాలమే మళ్ళీ వారిని కలుపుతుంది.... అదే వివాహబంధంలోని పవిత్రత! ఈరోజు మంచిదికూడా!.... రాత్రి బయల్దేరివెళదాం!" — అంటూ కన్నీరు పెట్టుకున్నారు.

"పిచ్చినాన్నా!" నీకేం తెలియదు! — అనుకుంది నీరజ బాధగా.

* * * *

నీరజను వెంటబెట్టుకొని- అల్లుడి ఇంట్లో అడుగు పెట్టారు శ్రీనివాసరావుగారు ... ముందువైపు వరండాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు మురళీకృష్ణ.

హఠాత్తుగావచ్చిన నీరజనూ, మావగార్నీచూసి మురళీకృష్ణ ఆశ్చర్యపోయాడు. 'కలా, నిజమా' అనుకున్నాడు. సంతోషంతో, లేచి స్వాగతం చెబుదామనుకున్నాడు.... నీరజవైపు నిశితంగా చూశాడు. ఆమె కళ్ళలోని నిర్లిప్తత చూడగానే- మొదటిరాత్రి ఆమె అన్నమాటలు ఉతని చెవుల్లో మళ్ళీ మారుమ్రోగాయి.

మనసులోని భావాలను పైకేవీ కనిపించనీయకుండా, లేచి నిలబడి- "రండి!" అన్నాడు పొడిగా.

"రంగమ్మా"- మురళీకృష్ణ పిలుపువిని- లోపలినుంచి ఓ వయసుమళ్ళిన వితంతువు అక్కడకు వచ్చింది.

"ఈవిడ చిన్నప్పుడు నన్ను పెంచింది. ఇప్పుడు తనవారి నందర్నీ పోగొట్టుకొని - నా దగ్గరకే వచ్చేసింది!... నాకుమాత్రం ఎవరున్నారు? పెద్దదిక్కులా ఈ ఇంటిని చూసుకుంటోంది" - అంటూ రంగమ్మను శ్రీనివాసరావుగారికి పరిచయం చేశాడు.

"ఈయన మా మావగారు.." - ఆమెకు చెప్పాడు.

వచ్చినవాళ్ళెవరో రంగమ్మకు అర్థమయింది. నీరజను - ఆదరంతో లోపలకు తీసుకెళ్ళింది.

శ్రీనివాసరావుగారు అల్లుడి క్షేమసమాచారాలూ, ఆఫీసు విషయాలూ అడిగితెలుసుకున్నాక - మెల్లిగా అన్నారు.

"చూడుబాబూ.... నీరజ ఒఠిపిచ్చిది. దాన్ని అపార్థంచేసు

కోకు. భార్యాభర్తలన్న తర్వాత, పంతాలకూ పట్టింపులకూ పోకూడదు. మీరే కలుసుకుంటారని నా పెద్దరికాన్ని నేను కాపాడుకున్నాను. కానీ, మనసులో ఎంత బాధగావుండేదో భగవంతుడికే తెలుసు. చివరకు నీరజే, స్వయంగా నాతో - 'నన్ను వారివద్దకు తీసుకువెళ్ళడాడీ!' అన్నప్పుడు, కొండంత బరువు గుండెలమీద నుంచి దింపుకున్నాను బాబూ! అందుకే ఇప్పుడు తన ఇంటికి, తనుగా బయల్దేరింది అమ్మాయి. ఎలా చూసుకుంటావో? నీకేదైనా కష్టం కలిగివుంటే, నీరజ తరఫున క్షమార్పణ నేను కోరుకుంటాను."

శ్రీనివాసరావుగారి మాటలకు మురళీకృష్ణ మైమరిచిపోయాడు. హృదయపు అడుగుపొరలో సన్నటి ఆనందవీచిక లేచి, హృదయమంతా ఆవరించుకుంది. నీరజ నిజంగా తనంతటతాను వచ్చిందా? ఎన్నోసార్లు మధ్యవర్తులు ఈ విషయంలో కల్పించుకుని విసిగిపోయారు. ఇన్నాళ్ళకు తనకు తానుగా, తనయింటికి వచ్చేసిందా?.. అంతకంటే అదృష్టం మరొకటి లేదు. ఇంతమంచిరోజు ఒకటి వస్తుందని ఎన్నడూ తాను ఊహించలేదు.

శ్రీనివాసరావుగారితో అన్నాడు.

పెద్దవారు మీరలా అనకూడదు. మీ ఆశీస్సుంటే అదే పదివేలు. మీరేమీ అనుకోనంటే నాదో చిన్నవిన్నపం. నాకు మాత్రం ఎవరున్నారు? మీరుకూడా మాతోబాటే వుంటే నేనెంతో సంతోషిస్తాను. మీలో, మా నాన్నగారినే చూసుకుంటాను....కాదనకండి!"

ఎంతో ఆదరణతో, ఆప్యాయతతో అంటున్న మురళీకృష్ణ మాటలకు చలించిపోయారు శ్రీనివాసరావుగారు.

"బాబూ! నువ్ అంతమాటన్నావ్.... నాకంతేచాలు.. ఇన్నాళ్లూ నీరజను వదిలి ఎక్కడికీ వెళ్ళలేకపోయాను.... నా ఆప్త మిత్రులు తలోచోటా వున్నారు.... ఎప్పట్నుంచో ఉత్తరాలు రాస్తున్నారు రమ్మని!.... ఓసారి వెళ్ళిరావాలని అనుకుంటున్నాను.... అట్నుంచి అలా కాశీకూడా వెడదామని ఆశగావుంది..

ఇక నీరజ విషయంలో నాకు ఎలాంటి దిగులూలేదు.... మనవడు పుట్టిన తరువాత, ఎలాగా వాడితో ఆడుకోవటానికి వచ్చేస్తాను.... అంతవరకూ నన్నలా తిరిగిరానీయ్ బాబూ ?"- అన్నారు కళ్ళు తుడుచుకుంటూ శ్రీనివాసరావుగారు.

పనికుర్రాడు రాజు - వాళ్ళిద్దరికీ - కాఫీ, బిస్కెట్లు తీసుకొచ్చాడు.. మావగారు వద్దంటున్నా వినలేదు మురళీకృష్ణ.... కొంచెంసేపు లోకాభిరామాయణం ముచ్చటించుకున్నాక, 'ఇక వెడతా'నంటూ లేచారు శ్రీనివాసరావుగారు.

నీరజ హాల్లో గోడవద్ద నిలబడి - అక్కడ తగిలించివున్న 'సీనరీ'ని తదేకంగా చూస్తోంది ... మురళీకృష్ణ రాకను గమనించి, అయిష్టంగా తల పక్కకు తిప్పుకుంది.... ఆమె ప్రవర్తన మురళీకృష్ణ ఆనందానికి ఆనకట్టయింది.

అక్కడే ఆగిపోయాడు.

"మీనాన్నగారు వెడతానంటున్నారు"- అని ఆమెకుచెప్పి - మళ్ళీ లోపలకు వెళ్ళాడు.

నీరజ తండ్రిదగ్గరకు వెళ్ళింది... ఆమెకంట్లో నీరుతిరిగింది. ఆయన నీరజను హృదయానికి గాఢంగా హత్తుకున్నారు. ఈతండ్రీ కూతుళ్ళు అందరిలాంటివాళ్లూ కాదు... ఇద్దరూ అత్యంత ప్రాణ స్నేహితులు... ఏనాడూ ఒకరిని విడిచి మరిఒకరు ఉండలేదు.... కానీ ఇప్పుడు తప్పదుమరి.... ఇది ప్రపంచధర్మం!

బరువెక్కిన హృదయంతో అక్కడనుంచి బయల్దేరి, తన శూన్యగృహాన్ని చేరుకున్నారు శ్రీనివాసరావుగారు.

అర్ధాంగి మహాలక్ష్మి - సీతానగరం - చిన్ననాటి స్నేహితుడు రామ్మూర్తి.... ఆవెంటనే తన వైభవం... అదంతా మొదటిదశ తిరిగివున్న ఆస్తంతా పోగా, చిన్నయింటిలోకి మకాం మార్చటం - నీరజచేత ఉద్యోగం చేయించటం - అది రెండోదశ; ఇప్పుడు, నీరజలేని ఆ యిల్లూ, ఇకముందు గడపబోయే జీవితం - ఇదంతా ఇక మూడవదశ.... బహుశా ఇదే చివరదశ కావచ్చునేమో ?

ఏవేవో తలబోసుకుంటూ ఆరాత్రి చాలాసేపు మెలకువగానే వుండిపోయారు శ్రీనివాసరావుగారు.

* * * *

శ్రీనివాసరావుగారు వెళ్ళిపోగానే, నీరజ అక్కడేవున్న కుర్చీలో కూర్చుని మొహం చేతులతో కప్పుకొని నిశ్శబ్దంగానే రోదించింది.... రంగమ్మ ఆప్యాయతతో ఆమె కురులు సవరిస్తూ- "లోపలకు, రామ్మా"-అంది.... కళ్ళుతుడుచుకుని అతిమామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూ- రంగమ్మతో లోపలకువెళ్ళింది నీరజ... డ్రెస్ చేసుకుని ఎక్కడికో వెడుతున్న మురళీకృష్ణనుచూసి ఒక క్షణం ఆగిపోయింది.... ఆమెనుచూసి అతను ఆగబోయి- మళ్లీ ముందుకు వెళ్ళిపోయాడు.

రంగమ్మ నీరజకు ఇల్లు చూపిస్తోంది.... ఇల్లు చిన్నదే అయినా ఎంతోనీట్‌గా సర్దివుంది.... బెడ్‌రూమ్‌లోకి వెళ్లినప్పుడు మాత్రం నీరజకాళ్ళు సన్నగా వణికాయి.... గదిలోరెండు 'సింగిల్ కాట్స్' దగ్గర దగ్గరగా వేసివున్నాయి. పెద్ద పువ్వుల దుప్పటీ- రెండు మంచాలను కలిపి- కప్పింది.... గోడలకు ఎంతో అందమైన కలర్‌సీనరీ లున్నాయి.... ఆ పక్కనే తగిలించివున్న ఫొటోను చూడగానే నీరజగుండె ఆగిపోయింది. అది మసక వెన్నెల్లో మెరుస్తున్న తాజ్‌మహల్!.... దాన్ని చూస్తూ అలాగే నిలిచి పోయింది.

తాజ్‌మహల్ అంచున నిలబడి- చేతులుచాచి "రా నీరజా!" అని శేఖర్ ఆర్తిగా పిలుస్తున్నట్లే కనిపించింది నీరజకు.... కళ్లు తిరిగాయి.... అక్కడేవున్న కుర్చీలో కూర్చుండి పోయింది.... రంగమ్మ ఎప్పుడు బయటకువెళ్లిందోకూడా తానుగమనించలేదు.... అలా కూర్చుని, గదంతా పరిశీలిస్తున్న ఆమె కళ్ళు మంచాలమీద పడి ఆగిపోయాయి.... వున్న రెండు మంచాలూ పక్కపక్కన ఆనుకొని వున్నాయి. మరి తాను ఎక్కడ పడుకోవాలి?.... పోనీ ఓ మంచం తీయించి పక్కగదిలో వేయించుకుంటే?.... రంగమ్మ! రాజు, పనిమనిషీ- ఏమనుకుంటారు?.... ఆలోచనలతో నీరజ తల దిమ్మెత్తిపోతోంది.

రంగమ్మ వచ్చి- స్నానానికి నీళ్ళు సిద్ధంగా వున్నాయని చెప్పింది.... స్నానం పూర్తిచేసివచ్చేసరికి- టేబుల్ మీద భోజనం అమర్చి వుంచింది.

భోజనానికి కూర్చున్న నీరజతో- "మీరు కానివ్వండమ్మా! బాబు చాలా పొద్దు పోతేనేగానీ రారు!.... మీకు పెట్టేయమనీ తన కోసం చూడవద్దని చెప్పారు"- అంది రంగమ్మ.

"బ్రతికించారు" - అని మనసులోనే అనుకుంది నీరజ.

వేడి వేడిగా భోజనంచేసి - తన గదిలోకి వెళ్ళింది.... రోజంతా అలసిపోయిన మనసు విశ్రాంతి కోరుతోంది.... పడుకున్న వెంటనే ఒళ్లు తెలియకుండా నిద్రపట్టేసింది.

చిన్నగా ఏదో చప్పుడయితే, ఉలిక్కిపడి కళ్లు తెరచింది. రెండో మంచంమీద మురళీకృష్ణ - పడుకొని - ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

అతని ముఖం నిశ్చలంగా వుంది.... తనను పలకరించనందుకు, అతనికి మనసులోనే ధన్యవాదాలు తెల్పుకుంది.... అయినా ఇష్టంలేని ఆడదాన్ని ఏ మగవాడూ ఏమీ చేయలేడని తెలుసుకుంది.... రెండో ప్రక్కకు తిరిగి - నిశ్చింతగా నిద్రపోయింది నీరజ.

* * * *

నీరజకు క్రమంగా ఆ యిల్లూ, వాతావరణం అలవాటయింది. ఓ రోజు ఉదయం, రంగమ్మ ఉప్మా తయారుచేస్తూంటే, ఆమెను తప్పుకోమని, తానే కల్పించుకుని ఉప్మా తయారుచేసింది.

మామూలుగా, మురళీకృష్ణతోబాటే తానుకూడా టేబులు ముందు కూర్చుంది. ఉప్మా ప్లేట్లు తీసుకొచ్చి వారి ముందు పెట్టింది రంగమ్మ.... ఉప్మా తింటూ - రంగమ్మను చాలా మెచ్చుకున్నాడు మురళీకృష్ణ.... రంగమ్మ మధ్యలో కల్పించుకుని ఏదో చెప్పాలనుకుంది.... ఆ ఉప్మా, తాను చేయలేదనీ, నీరజే తయారు చేసిందనీ, అతనికి చెప్పాలని ఆమె తాపత్రయం.... కానీ చెప్పనిస్తేగా?" అయినా అతనికి తెలుసు, ఉప్మా రంగమ్మ చేయలేదని....!

తాను నీరజతో కల్పించుకుని మాట్లాడకపోయినా, ఆమె చర్యలన్నీ అతను గమనిస్తూనే వున్నాడు.

రంగమ్మ మళ్లీ లోపలకువెళ్ళి కాఫీ తెచ్చింది.... "కాఫీ కూడా ఇవాళ బాగా కుదిరింది" - అంటూ లేచాడు మురళీకృష్ణ.

మురళీకృష్ణ ఆఫీసుకు వెళ్ళిపోయిన తరువాత - నీరజకు ఏమీ తోచేది కాదు.... అతను ఇంట్లో వున్నప్పుడయితే, అతనితో మాట్లాడక పోయినా, అతని దినచర్యను గమనించటంలో, కొంత కాలక్షేపం అయ్యేది.... ఉదయంపూట కాఫీ టిఫెన్లు తయారు చేయటం, మధ్యాహ్నం - రంగమ్మకు వంటపనిలో సాయపడటం-కేరేజీలో భోజనంసర్ది, రాజుచేత ఆఫీసుకు పంపించటం - కాసేపు పుస్తకాలు చదవటం- అలా చదువుతూనే నిద్రపోవటం.... మళ్లీ మధ్యాహ్నం ఏ మూడుగంటలకో లేచి, కాఫీ తయారుచేసి తాను తాగి - మురళీకృష్ణకోసం వేరే ఫ్లాస్కులోపోసి వుంచటం - సాయంత్రం కాఫీతాగి, మురళీకృష్ణ క్లబ్బుకి వెళ్ళిపోయిన తరువాత రాత్రి వంటకు మళ్లీ రంగమ్మకు సాయంచేయటం - లేదా ఏదైనా సినిమాకు వెళ్ళిరావటం... అలా తన దినచర్యను మలచుకొంది నీరజ.

రాత్రి ప్రొద్దుపోయిన తరువాత క్లబ్బునుంచి వచ్చే మురళీకృష్ణకు రంగమ్మే భోజనం పెట్టేది.

మాట్లాడేవాళ్ళు లేకపోవటంతో, పూర్తిగా పుస్తకాలనే ఆశ్రయించింది నీరజ.... ఎప్పుడైనా రాత్రిసమయాల్లో డాబామీద చాలా పొద్దుపోయేదాకా కూర్చుండే - కళ్ళముందు ఎన్నో అద్భుత దృశ్యాలు కనిపించేవి.

ఊర్ధ్వాకాశంలో, అతిదూరానవున్న విశ్వగోళాలకోసం జ్యోతి స్వరూపంలో వచ్చిన దూతలవలే లెఖ్ఖలేనన్ని తారకలు.... ఆకాశంలో ఆ నక్షత్రరాశి విద్యుద్దీపాల లాగా వెలిగిపోయేవి.... అదే పనిగా అప్పుడప్పుడు చూస్తూండటంవల్ల - వాటితో ఆమెకు పరిచయం ఏర్పడింది.... చుట్టూ చిక్కని చీకట్లు !... ఏకాంత నిశ్శబ్దత....గాఢనిశీధి....ఆపైన సన్నిహితమైన అనంతజ్యోతిర్లోకం..

ఒక్కొక్క రోజున, అతిలోక జ్యోత్స్నవంటి వెలుగుఏదో ఆకాశంలో ఎక్కడో, మహాంధకార సముద్రం మధ్యలో-విద్యుద్దీప భవన ప్రాంగణంమాదిరి కానవచ్చేది.... ఆ భవనంలో శేఖర్, నరేష్, శ్రీనివాసరావుగారూ, దాస దాసీజనం.... అందరూ కని పిస్తూండేవారు.

'శేఖర్.... రోజులు ఇంత భారంగా కదులుతున్నాయేమిటి? నీకోసం చేసే ఈతపస్సు ఎప్పటికి ముగుస్తుంది?.... అంతవరకూ అసలీ ప్రాణాలు నిలుస్తాయా?... ఈ చీకటిరాత్రులు గడిస్తే ఇంక అంతా వెన్నెలేకదూ? ఆవెన్నెల ఎప్పుడు కురుస్తోందో?.'

వెన్నెల .., వెన్నెల.

వెన్నెల మరింత కాంతివంతంగా కనిపిస్తోంది నీరజ కళ్ళకు. ఎంత చిత్రంగావుంది! నిర్జనమైన ఇసుకమైదానాలపైనా, దీర్ఘవన పాచపాల అడవి అంచునపడే వెన్నెల!.

పైన విశాల ఆకాశవీధి....క్రింద ఛాయావిహీనమైన నిశీథి... పర్వతారణ్యమయమార్గంలో వెన్నెల...ఇసుకమైదానంలో వెన్నెల.. మళ్ళీ అంతలోనే ఎక్కడచూసినా చీకట్లు.... చీకటి మైదానాలూ..,. చీకటి గుహలూ.... అంతా చీకటి..., చీకటి.. .

* * * *

నీరజ రాకతో మురళీకృష్ణకు - తన యిల్లంతా వెలుగుతో నిండినట్లు అనిపించింది. కానీ ఆమె ప్రవర్తన అతని మనసులో చీకటిని నింపుతోంది. ఇప్పటికీ తనను పరాయి వ్యక్తిగానే చూస్తోంది. పెదవి విప్పి ఒక్కమాటయినా మాట్లాడదు. ఆమె మనసులో ఏముందో మరి! ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నదానిలా ఉంటుంది.

ఒక్కసారి ఆమెను తన గుండెలకు గాఢంగా హత్తుకుని.

"నీ మనసులోని బాధేమిటో నాతోచెప్పు నీరజా!.... నీ బాధను నన్నుకూడా పంచుకోనివ్వు.... నీమౌనం నేను భరించలేక పోతున్నాను."—అని చెప్పాలని మురళీకృష్ణ ఎన్నోసార్లు అను కున్నాడు. ఆమె మనసును కాలమే మార్చాలి!.... ఆరోజుకోసం

నిరీక్షణ తప్పదు.... అంతవరకూ తన కళ్ళయెందు ఆమె అలా కనిపిస్తూంటే అంతే చాలుననుకున్నాడు

ఎలాగో కాలాన్ని వెళ్ళబెట్టాలి కనుక- సాయంత్రంపూట క్లబ్బుకివెళ్ళి వస్తున్నాడు. అలా వెళ్ళినా అతనిమనసంతా నీరజ మీదనే వుండేది. తాను ఇంట్లో ఎంత తక్కువసమయం వుంటే - నీరజకు అంత ఇష్టమని గ్రహించాడు.... తనకెంతో ఆప్తుడయిన రాజారామ్ బెంగుళూర్ ట్రాన్స్ఫరయి వెళ్ళిపోయాడు.... లేకపోతే అతనితో తనకెంతో కాలక్షేపం అయ్యేది.... ఇప్పుడు ఆఫీసు, అది కాగానే క్లబ్బు.... రోజులు భారంగానే గడుస్తున్నాయి అతనికి.

ఆరోజున ఆఫీసునుంచి ఇంటికిరాగానే నీరజ కనిపించలేదు రంగమ్మను అడిగాడు.

"అమ్మాయికి చాలా జ్వరం వచ్చింది బాబూ!.... నేను డాక్టరు దగ్గరకు తీసుకెడతానని ఎంత చెప్పినా వినకుండా- తానొక్కత్తే వెళ్ళింది.... సమయానికి రాజుకూడా లేడు"- అంది రంగమ్మ.

"నీరజకు జ్వరం వచ్చిందా ?.... ఒంటరిగా ఎందుకు వెళ్ళాలి? కబురుచేస్తే డాక్టరే వచ్చేవాడుగా ?"- మురళీకృష్ణకి కాస్త కోపం వచ్చింది.... తను వెంటనే డాక్టర్ వద్దకు బయల్దేరాడు.

అతన్నిచూడగానే నర్స్వెళ్ళి డాక్టరుకు చెప్పింది... డాక్టర్ రామారావ్ మురళీకృష్ణ ఫామిలీడాక్టరు... ఇద్దరూమంచి స్నేహితులు! ఎప్పుడైనా మురళీకృష్ణ డిస్పెన్సరీకి వెడితే" ఎన్నో విషయాలు ఎంతో ఆత్మీయంగా మాట్లాడుకుంటారు.

"హల్లో మురళీ! సమయానికివచ్చావ్! నీరజగారికి జ్వరం ఎక్కువగా వుంది... రెండురోజులు పోతేకానీ ఇది ఏం జ్వరమో తెలదు... 'హాస్పిటల్లో చేరుద్దామా, ఇంటిదగ్గరే ట్రీట్మెంట్ ఇవ్వటమా'అని ఆలోచిస్తున్నా... సమయానికి నువ్వూ వచ్చావ్.... నీకు ఏది సౌకర్యమో ఆలోచించు"- అన్నాడు రామారావ్.

"ఇంటికే తీసుకెడతాను! టైం ప్రకారం మందులిస్తాను....



ఎప్పటికీ మీకేమీకాను!

అవసరమైనప్పుడు వచ్చి ట్రీట్ మెంట్ ఇవ్వటానికి నువ్ వున్నావు కదా" - అంటూ చుట్టూ చూశాడు ఆదుర్దాగా.

"నీరజ లోపల వుంది.... ఇప్పుడే ఇంజక్షన్ ఇచ్చాను.... ఇంటికి తీసుకెళ్ళటం కష్టమేమో?.. బాగా వీక్ గా వుంది.... పైగా హై టెంపరేచర్ రన్నవుతూంది"—

"ఫర్వాలేదు.... టాక్సీ తీసుకొచ్చాను.... జాగ్రత్తగా తీసుకెడతాను" - అంటూ పక్క గదిలోకి నడిచాడు మురళీకృష్ణ.... అక్కడ 'కాట్'మీద పడుకుని వుంది నీరజ.... నిద్రలోనో మగతలోనో వున్నట్లుగా కళ్ళు మూసుకుని పడుకుంది.... ఆమె నుదుటిపై చేయివేసి చూశాడు ... కాలిపోతోంది.

నెమ్మదిగా ఆమెను నడిపించుకుంటూ టాక్సీ దగ్గరకు తీసుకెళ్ళాడు. అలా వెడుతున్నప్పుడు కళ్ళుతెరచి అతనివైపు తీక్షణంగా చూసి - మళ్ళీ కళ్ళుమూసేసుకుంది నీరజ.... మురళీకృష్ణ క్షణం సేపు బాధపడ్డాడు.

ఆ రాత్రి ఎప్పుడో - నీరజకు పూర్తిగా మెలకువ వచ్చింది. బెడ్ లైటు లేత నీలంరంగులో వెలుగుతోంది.... తన మంచానికి దగ్గరగా - కుర్చీలో కూర్చుని వున్నాడు మురళీకృష్ణ.... నీరజ కదలటం చూసి, అతను చటుక్కునలేచి ఆమె ప్రక్కన కూర్చుని- తల నిమురుతూ - "హార్లిక్స్ త్రాగుతావా నీరజా!.... చాలా నీరసంగా వున్నావ్" - అన్నాడు ఎంతో మృదువుగా.

కళ్ళుతెరచి చూసింది.... అతని గొంతు వింటూంటే అఘాదాల్లోంచి వచ్చే - అందని పిలుపులా వుంది.... అతని కళ్ళల్లోకి చూస్తూంటే - భూమిమీదకు జారిపోతున్న తురాయి పుష్పాల్లా వున్నాయి.... వెంటనే ఆమెకు శేఖరం జ్ఞాపకానికి వచ్చాడు.

"ఇప్పుడేం వద్దు" - అని, ప్రక్కకు తిరిగి పడుకుంది అతి ప్రయాసతో ...

రంగమ్మను పిలిచాడు మురళీకృష్ణ.... రంగమ్మ ఆదుర్దాగా వచ్చింది.

"ఫ్లాస్కులో హార్లిక్సుంది.... తీసుకురా!" -

మరుక్షణంలో ఫ్లాస్కూ-గాజుగ్లాసూ తెచ్చింది రంగమ్మ....

నీరజను బలవంతంగా లేవదీసి, తాను ఆమెకు ఆసరాగా ఆనుకుని - హార్లిక్స్ గ్లాసును ఆమె పెదవులకు అందించాడు.... నిస్సత్తువగా అతని చేతుల్లో కదలకుండా అలాగే వుండిపోయింది.

"తాగు తల్లీ! మూడు రోజులైంది.... ఇప్పటికి కళ్ళు తెరిచావ్.... ఈ మూడు రోజులూ - బాబు పచ్చి మంచినీళ్ళు ముట్ట లేదు..... నీ మంచం దగ్గర్నుంచి క్షణంసేపయినా కదలలేదు..... నిన్ను కంటికిరెప్పలా కాపాడుకున్నాడు.... భగవంతుడు చల్లగా చూశాడు..... నువ్ మళ్ళీకళ్ళు తెరిచావ్..... కాస్త హార్లిక్స్ తాగితే నీరసం తగ్గుతుంది.... తీసుకోతల్లీ"- రంగమ్మకు దుఃఖంతో గొంతు పూడుకపోయింది....

రంగమ్మను వారిస్తూ- "ఇంక నువ్ వెళ్ళిపడుకో రంగమ్మా.. చాలా పొద్దుపోయింది"- అంటూ ఆమెను పంపించేసి - నీరజను సరిగా పడుకోబెట్టి - మెడవరకూ రగ్గుకప్పి - తనువెళ్ళి, మళ్ళీ కూర్చున్నాడు మురళీకృష్ణ....

మళ్ళీ కళ్ళు మూసుకుంది నీరజ.... మూసుకున్న కళ్ళల్లోకి ఏవేవో ఆలోచనలు దూసుకొస్తున్నాయి....

'తాను మూడురోజుల నుంచీ మూసినకన్ను తెరవలేదన్న మాట!.... ఈ మూడురోజుల నుంచీ, తనకు సేవచేస్తూ - మంచం వద్దనే వుండిపోయాడా?..' - నీరజ కళ్ళల్లో నీరుతిరిగింది.. ఆలో చించే శక్తి తనలో సన్నగిల్లిపోతోంది... ఆమెకళ్ళు బరువుగా మూసుకు పోతున్నాయి....

మర్నాడు డాక్టర్ వస్తూనే - మురళీకృష్ణను ఎంతగానో అభినందించాడు....

నీరజకు ఇంజక్షన్ఇస్తూ- "యూ ఆర్ ఆల్ రైట్ నీరజ గారూ!.... ఆ యముడితో పోట్లాడి - మిమ్మల్ని బ్రతికించుకున్నాడు మా మురళీ!"- అన్నాడు రామారావు... ఆ మాటలకు మురళీకృష్ణ సిగ్గుపడ్డాడు.

"నిజం మురళీ ? నేనిచ్చిన మందులుకంటే, నువ్ ఆవిడకు చేసిన సపర్యలే, ఆవిడ ప్రాణాలను కాపాడాయి. ఇది విషజ్వరం. ఇక ప్రాణభయంలేదు.... కోలుకోవటానికి కొంచెం టైం పడు తుంది.... అంతే !...."- అంటూ- బలానికి మరికొన్ని మందులు రాసి- ఏఏసమయాల్లో ఎలావాడాలో వివరించి చెప్పాడు రామారావు.

డాక్టర్‌తోబాటు హాల్లోకి వెళ్లాడు మురళీకృష్ణ.

నీరజ మనసు మనసులో లేదు.... మురళీకృష్ణ సపర్యలు. అతని ఆప్యాయతా, తనను ఎందుకో కలవర పెడుతున్నాయి.... తాను అతని దగ్గరకువచ్చి - అప్పుడే అయిదు నెలలు గడచి పోయాయి.... ఈ అయిదు నెలల్లోనూ - ఎప్పుడూ అంతగా మురళీ కృష్ణ గురించి తాను పట్టించుకోలేదు.... ఇంతకుముందే అతనివైపు నిశితంగా చూసింది.... మనిషిచాలా చిక్కిపోయాడు. .. పూర్వపు ఛలాకీతనం అతనిలో మచ్చుకి కూడా కనిపించలేదు.... ఎందుకో- అతనిగురించిన ఆలోచనలే ఆమెలో చోటు చేసుకుంటున్నాయి.

ఒకరోజు, తనకేమీ తోచక సినిమాకు వెళ్ళింది.... అప్పటికే 'న్యూస్‌రీల్'చూపిస్తున్నారు.హాలులోబాగాచీకటిగావుంది.టార్చిలైటు వెలుతురులో కుర్రాడెవరో సీటుచూపిస్తే-కూర్చుంది.... కూర్చున్న తర్వాత కొన్నినిముషాలకు పక్కనవున్న మనిషి ఎవరా అని యదాలాపంగాచూసి ఉలిక్కిపడింది.... అదేసమయంలో ఆమెవైపు చూసిన మురళీకృష్ణ కళ్ళు తళుక్కున మెరిశాయి.... కానీ జాగ్రత్త పడి - మళ్ళీ సర్దుకొని కూర్చున్నాడు. .. ఇంటర్వెల్‌లో - తనకు కూల్‌డ్రింక్ ఆఫర్ చేస్తే తను వద్దంది.... పిక్చర్ వదిలినతరువాత- ఇద్దరూ ఒకే ఆటోలో ఇల్లు చేరుకున్నారు.... ఇద్దరూ మౌనంగా భోజనం చేశారు.

ఆసినిమా చాలా బాగుందికాబోలు-అందులోని కథగురించీ సంగీతంగురించీ ఏదో చెప్పబోయాడు మురళీకృష్ణ...కానీ అతన్ని పూర్తిగా చెప్పనివ్వకుండా - డాబామీదకు వెళ్ళిపోయింది తను.

మరికొంతసేపటికి రంగమ్మవచ్చి- "అయ్యగారు మిమ్మల్ని క్రిందకు వచ్చేయమన్నారు. చలి బాగా ఎక్కువగావుంది.... అసలే

మీకు బిలుబుచేసింది కూడాను"- అంది.

మాట్లాడకుండా క్రిందకు వచ్చేసి తనమంచంమీద పడుకుని తనుకూడా ఓపుస్తకం తెరిచింది.... తనమీద మురళీకృష్ణకువున్న ఆపేక్షకు క్షణంసేపు ముగ్ధురాలయింది.... కానీ, ఆవిషయం రంగమ్మద్వారా కాక, తానే స్వయంగా చెప్పివుంటే బాగుండేదికదా అనుకుంది.

అయినా ఎలాగో అలా ఈ మూడునెలలు గడిపేస్తే సరి... ఆ తర్వాత శేఖరంతో జీవితమంతా సంతోషంగా గడపవచ్చు.... ఆరాత్రి చాలాసేపు, శేఖరంతో గడపబోయే జీవితాన్నిగురించి కలలుకంటూ ఎప్పటికో నిద్రపోయింది.

ఒకసారి ఏదో పనిమీద, మురళీకృష్ణ బొంబాయివెళ్ళాడు.... ఇంకా తేలిగ్గా ఊపిరితీసుకుంది నీరజ.... కానీ ఆ ఆనందం ఎంతో సేపు నిలువలేదు.... రాత్రి ఆగదిలో ఒంటరిగా పడుకుంటే అసలు నిద్రేపట్టలేదు.... తమ ఇద్దరిమధ్యా మాటలుగానీ - పక్కమంచం మీద మరొకరు పడుకుని వున్నారనే ధ్యాసగానీ ఇద్దరిలో వుండేది కాదు....అయినా, ఒకరికొకరు తోడుగా, అనేకరాత్రులు అదే గదిలో నిద్రించారు.... అందుకే ఆరోజు ప్రక్కమంచంమీద మురళీకృష్ణ చదువుకుంటూ కనిపించకపోయేసరికి మనసంతా ఎలాగోఅయిపోయింది.... నీరజకు ఈఅనుభవం కొత్తగావుంది.... అసలు రెండురోజులు పనేలేనట్టు అనిపించింది.... అతని బట్టల బీరువాతెరచి అన్నీ నీట్‌గా సర్దింది.... అన్నిపనుల్లోనూ శేఖరమే గుర్తుకొచ్చి - ఇంకా తాము కలుసుకోవటానికి ఎంతగడువుందో చెబుతున్నట్టే అనిపించింది.

బొంబాయినుంచి తిరిగివచ్చిన మురళీకృష్ణ - ఇంట్లోజరిగిన చిన్నచిన్నమార్పులు చూసికూడా ఏమీ అనలేదు.... 'మురళీకృష్ణ కూడా శేఖరంలాంటివాడు కాదుకదా?' ఏదీకూడా పైకి చెప్పుకునే స్వభావం కాదుకాబోలు'- అని సరిపెట్టుకుంది.

అయినా ఇంకెన్నాళ్ళు?

అలా ఆలోచిస్తున్న కొద్దీ- నీరజ మనసులోకి శేఖరంతో

బాటు అప్పుడప్పుడు మురళీకృష్ణకూడా చొరపడుతున్నాడు...కణతలు నొప్పితో పగిలిపోతున్నాయి... తలను అటూ ఇటూ కొట్టుకుంటోంది డాక్టర్ని పంపించేసి లోపలకువచ్చిన మురళీకృష్ణ నీరజనుచూసి ఖంగారుపడ్డాడు.

"ఏమైంది నీరజా!... ఏమిటీ?... తలనొప్పా?... అదే తగ్గిపోతుంది... మూడురోజులనుంచీ ఒళ్లు ఎరక్కుండా పడు కున్నావ్... ఇప్పుడేకదా కళ్లు తెరిచావ్!'... కాస్త ఓర్చుకోవాలి... టాబ్లెట్ ఇస్తానుండు"– లేచి ఆమెను కూర్చోబెట్టి మాత్రమింగిం చాడు... కాస్సేపటికి తేరుకొని, కళ్ళు మూసుకునిపడుకుంది నీరజ.

సమయానికి శ్రీనివాసరావుగారు ఊళ్ళోలేనందున బాధ పడ్డాడు మురళీకృష్ణ... ఆసాయంత్రానికి మళ్లీ జ్వరం తిరగబెట్టింది నీరజకు... మురళీకృష్ణతోపాటు డాక్టరుకూడా ఆందోళన చెందాడు.

చాలా ఆరాటపడుతోంది నీరజ... ఏవేవో పలవరిస్తోంది... మురళీకృష్ణకు అంతులేని ఆవేదనగా వుంది... అతన్ని గమనించిన డాక్టరు హాల్లోకి రమ్మనిపిలిచాడు... ఇద్దరూ అక్కడ కూర్చున్నారు.

"చూడు మురళీకృష్ణా!... నీభార్య ఏదో విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తోంది... మీ యిద్దరిమధ్యా ఏమైనా అభిప్రాయ భేదాలుగాని వచ్చాయా?... నీకు డాక్టర్నీ కాదు... స్నేహితుడ్ని కూడా! అదేమిటో నాకుకూడా చెబితే, నాకుసాయంచేసిన వాడివవు తావ్.., కావాలంటే ట్రీట్‌మెంట్ విషయంలో ఇంకో డాక్టర్నికూడా సంప్రదిస్తాను" — అన్నాడు రామారావు.

మురళీకృష్ణ తలవంచుకుని కూర్చున్నాడు.

డాక్టరుకు ఏమని సమాధానం ఇవ్వాలి? ఇద్దరిమధ్యా పూడ్చ లేని అగాధం వుందనిచెప్పాలా?.... అంతులేని ఆవేదనమాత్రమే తన నరాల్లో ప్రవహిస్తోందని చెప్పాలా?.... అయినా, నీరజ అలా ఎందుకు వున్నదో, ఎందుకని అలా ప్రవర్తిస్తున్నదో, కారణం తనకు తెలిస్తేకదా, రామారావ్‌కి చెప్పటానికి.

మురళీకృష్ణభుజం తట్టి– "పోనీలే....సావకాశంగాచెబుదువు గాని.... ప్రస్తుతం ఈ మందులు వాడు!".... అని ప్రిస్క్రిప్షన్

రాసి కాగితం అతని చేతిలోపెట్టి వెళ్లిపోయాడు రామారావు.

నీరజవద్ద కూర్చుని. ఆమెవైపే తదేకంగా చూస్తూ కూర్చున్నాడు మురళీకృష్ణ.... తెల్లని నీరజ మరింత తెల్లగాపాలిపోయింది చాలా బలహీనంగా వుంది.

ఆ రాత్రి రెండు మూడు సార్లు పలవరించింది నీరజ.

"నేను వచ్చేస్తున్నాను శేఖర్.... నువ్ పెట్టినగడువు తీరిపోతుంది ... వచ్చేస్తాను శేఖర్...."—

నీరజ పలవరింతలువిన్న మురళీకృష్ణ ఉలిక్కిపడి - సరిగ్గా కూర్చున్నాడు.

అతని కళ్లముందు తెర తొలగిపోయింది.

అనాటి శేఖర్..... అతన్ని నీరజ ఇంకా మర్చిపోలేదా?....

శేఖరాన్ని నీరజ ఇంకా ప్రేమిస్తోందా ? ?....

* * * *

"రాజా ! నీరజను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను... ఎలాగైనా ఆమెను వివాహం చేసుకోవాలి !" - మురళీకృష్ణ మాటలు దృఢంగా వున్నాయి. అతనివైపు వింతగా చూశాడు రాజారాం....

"లాభంలేదు మురళీ !..... ఆమె శేఖరాన్ని ప్రేమించింది. అతనుకూడా ఆమెను ఆరాధిస్తున్నాడు. వారిద్దరి వివాహానికీ - శ్రీనివాసరావుగారు బహుశా అడ్డుచెప్పరు కూడా !..... ఆవిడగారి మీద అనవసరంగా ఆశలు పెంచుకోవద్దు !" - అన్నాడు.

"నీరజలోని హుందాతనం - ఆమె అందం - మేనర్స్ - నన్ను అమితంగా ఆకర్షించాయి. ఎన్ని వ్యసనాలున్నా, ఎంత మందితో తిరిగినా, చివరికి ఒక స్త్రీకి కట్టుబడిపోతాడు పురుషుడు.... నేను పూర్తిగా అలాంటివాడిని కాకపోయినా, నీరజ నా మనసును కట్టేసింది... పెళ్ళి చేసుకోవటం అంటూ జరిగితే ఆమెతోనే!..."

"అయితే నీ ఉద్దేశ్యం - బలవంతంగానైనా ఆమెను పెళ్ళి చేసుకుందామనా ?"—

"అదికాదు నా ఉద్దేశ్యం ! నేను మనస్ఫూర్తిగా కోరుకున్నది ఇంతవరకూ ఫెయిల్ కాలేదు.... అఫీసరును కావాలను

కున్నాను.... అయ్యాను!.... చిన్న అందమైన ఇల్లు కట్టుకోవా లనుకున్నాను. నా అభిరుచికి తగినట్టు అమర్చుకున్నాను.... ఇల్లాలి విషయంలో కూడా నా కోరిక నెరవేరుతుంది.

దృఢంగా చెబుతున్న మురళీకృష్ణవైపు కన్నార్పకుండా చూస్తుండిపోయాడు రాజారాం.

"ఒకవేళ దైవబలం అనుకూలంగా వుండి - నీరజ నీకు భార్య అయిందే అనుకో - అప్పుడు ఆమెకు శేఖరంతోవున్న అనుబంధాన్నీ చనువునీ - నువ్ మరచిపోగలవా?...."

"తప్పకుండా మరచిపోగలను! మనకు అసాధ్యమంటూ ఏదీ లేదు!.... ముఖ్యంగా నీరజ విషయంలో నేను ఏదీ మనసులో వుంచుకుని ఆమెను బాధించను!.... ఆమె జ్ఞాపకాలకు అడ్డు రాను!.... అపార్థం చేసుకోను"—

"అవన్నీ ఇప్పటి మాటలు! నిజంగానే నీరజ నీ భార్యగా ఈ ఇంటికి వచ్చినపుడు - క్షణ క్షణం ఆమె గతం నీ గుండెల్లో బాకులా గుచ్చుకుంటుంది. అప్పుడు నీ జీవితం నరకమే అవు తుంది"— అన్నాడు రాజారాం.

"లేదు రాజా! అలా ఎప్పటికీ జరగదు.... నీకు మాట ఇస్తున్నాను. నీకంటే నాకు ప్రాణమిత్రులెవరూ లేరు!.... ఎలాగైనా శ్రీనివాసరావుగారికి నువ్వే నచ్చచెప్పాలి!.... నీరజను పువ్వుల్లో పెట్టి ప్రాణాధికంగా చూసుకుంటాననీచెప్పాలి!.... ఏ తండ్రయినా తనకూతురు సుఖపడాలనే కోరుకుంటాడు.... అన్నివిధాలా ఆ శేఖర్ కంటే నేనే ఎక్కువస్థితిలో వున్నాను.... అందుకే నువ్ గట్టిగా చెప్పావంటే- శ్రీనివాసరావుగారు ఒప్పుకోవటమేకాదు.... నీరజను ఒప్పిస్తారు.... ప్లీజ్.... రాజా!.... నాకోసం ఈ సహాయం చేయాలి"—

మురళీకృష్ణ వింతధోరణి రాజారామ్‌కు అర్థంకాలేదు...అసలు అతని పిచ్చిగానీ అలా జరగడానికి అవకాశంవుందా?.... అయినా అతని సంతృప్తికోసం, శ్రీనివాసరావుగారితో మాట్లాడాలనే నిర్ణ యించుకున్నాడు రాజారామ్.... ఫలితం ఎలావున్నా- మురళీకృష్ణ

కోరిక శ్రీనివాసరావుగారికి చెప్పటం- స్నేహధర్మంగా భావించి ఆయన వద్దకు వెళ్ళాడు రాజారామ్.

శ్రీనివాసరావుగారు రాజారామ్ చెప్పినదంతా విని గాఢంగా నిట్టూర్చారు.

"అమ్మాయి మనసులో ఏముందో తెలియదు బాబూ!.... శేఖరం ఈఇంటి అల్లుడవుతాడని ఆశిస్తున్నాను.... శేఖరంఉద్దేశ్యం కూడా స్పష్టంగా తెలియటంలేదు.... ఇంతవరకూ తన హద్దుదాటి ఎరగడు.... చాలా ఉత్తముడు.... అయినా ఎవరికిఎవర్ని రాసిపెట్టి ఉంచాడో భగవంతుడు?.... మరోసారి నువ్వొచ్చినప్పుడు- ఈ విషయంలో ఏ సంగతీ చెప్తాను బాబూ!" అన్నారు.

వున్నదున్నట్లుగా ఆయన చెప్పినదంతా మురళీకృష్ణకు అందజేశాడు రాజారామ్.... అయినా రాజారామ్‌కు మాత్రం, ఈసంబంధం మురళీకృష్ణ వదులుకుంటేనే మంచిదనుకున్నాడు.... ఆ విషయమే మురళీకృష్ణతో అన్నప్పుడు-

"నీకు అన్నీ అనుమానాలేరా! చెప్పగానే- ఎగిరి గంతువేసి 'అలాగే' అంటారా ఎవరైనా?.... కొద్దిరోజులు టైం ఇద్దాం.... వాళ్ళుకూడా ఆలోచించుకోవాలికదా?"- అన్నాడు మురళీకృష్ణ.... అతని మాటలకు మరేమీ సమాధానం చెప్పలేకపోయాడు రాజారామ్.

ఆతరువాత మరోరెండుసార్లు రాజారామ్ శ్రీనివాసరావుగార్ని కలుసుకున్నా' ఆయన ఇదమిద్ధంగా ఏ సంగతీ తేల్చి చెప్పలేకపోయారు. కానీ, నాలుగోసారి ఆయనను కలుసుకున్నప్పుడు-

"మా అమ్మాయిని అడిగాను బాబూ!.... 'మీ ఇష్టం' అంది ఈ విషయం అతనికి చెప్పి- ఓసారి రమ్మనమని చెప్పు బాబూ"!- అన్నారు.... వారి మాటల్లో ఆనందంవున్నా- ఎక్కడో విషాదం కూడా వినిపించకపోలేదు.

రాజారామ్ తెచ్చిన శుభవార్తకు పొంగిపోయాడు మురళీకృష్ణ.... అతన్ని అమాంతం కౌగలించుకొన్నాడు.

"నీఋణం ఈజన్మలో తీర్చుకోలేనురా? ....నేను అదృష్టవంతుడ్నిరా!.... ఇకనుంచీ నీరజ నాది!....కొంతమందికి ఎదుప

చూసినవి దొరికిన తర్వాత - వాటివిలువా, మోజూ తగ్గిపోతా యంటారు.... నా విషయంలో అది నిజంకాదని నిరూపిస్తాను.... నీరజ నా ఆరాధ్యదేవత !- ఆమెను జీవితాంతం పువ్వుల్లోపెట్టి పూజిస్తాను ..." - మురళీకృష్ణ ఆనందం వర్ణించనలవి కాకుండా వుంది.... స్నేహితుని ఆనందంలో, తానుకూడా పాలుపంచు కున్నాడు రాజారామ్.

పెళ్ళిలో - నీరజ ప్రవర్తనకు మురళీకృష్ణ ఆనందంకాస్తా చప్పగా చల్లారిపోయింది.... శేఖరం జ్ఞాపకం వచ్చాడతనికి !.

* * * *

నాటికి నేడు, నీరజ పలవరింతల్లో - మళ్ళీ శేఖరం గుర్తు కొచ్చాడు మురళీకృష్ణకు.... గుండెను ఎవరో పిండినట్లయింది.

ఈ నీరజ ఎప్పటికైనా శేఖరానిదే.... తనదికాదు.... కాలేదు !.... శేఖరం ఎంత అదృష్టవంతుడు ?.... ఇలా ఆరాధించ బడటం అతనిభాగ్యం.... మరి శేఖరాన్ని కాదని తనను చేసు కోవటం ఎలా జరిగింది ?.... ఎవరి బలవంతమూ లేకుండానే ఈ పెళ్ళి జరిగిందికదా !....

నిజంగా శేఖర్ దగ్గరకు వెళ్ళిపోతుందా నీరజ ?.... అదే జరిగినట్లయితే, ఈ శూన్యమందిరంలోకి ఏ అనుభూతిని చొరబడ నీయకుండా ఒంటరిగా జీవించగలడాతను ?.... తలచుకుంటూంటే మురళీకృష్ణ మనసు చెదిరిపోతోంది.... కణతలు పగిలిపోతున్నాయి.

నీరజ మళ్ళీ పలవరిస్తోంది.

"నీకోసంవచ్చేశాను శేఖర్.... ఒక్కసారి ఇలాచూడవూ ?. మాట్లాడవేం ?.... మురళీకృష్ణమీద కోపంవచ్చిందా ?.... అయన చాలా మంచిమనిషి శేఖర్.... నిజంగా దేవుడు !...."- అటూ ఇటూ ఆరాటంతో దొర్లిపోతోంది నీరజ.... ఒళ్ళు జ్వరంతో కాలి పోతోంది.

ఆమెను సరిగా పడుకోబెట్టు - దుప్పటికప్పి - పక్కనే కూర్చున్నాడు మురళీకృష్ణ.... అతని మెదడు మొద్దుబారిపోయింది. రంగమ్మకూడా ఆదుర్దాగా ఆమె మంచంపక్కనే కూర్చుంది.

ఎక్కడో దూరంగా కుక్కలు భయంకరంగా అరుస్తున్నాయి.... నీరజప్రాణం గాలిలో దీపంలా కొట్టుకుంటోంది.... రాజును పిలిచి, వెంటనే డాక్టరును తీసుకరమ్మని పంపించాడు మురళీకృష్ణ.

'రోజాపుష్పం రాలిపోతుందా ;....' గజగజా వణికిపోయాడతను.... నీరజ ఇంకా సంధిమాటలు ఏవేవో మాట్లాడుతూనే వుంది.... డాక్టర్ రామారావు, తనవెంట మరో డాక్టర్నికూడా తీసుకుని వచ్చాడు.... ఇద్దరూ నీరజను పరీక్షించి - ఇంజక్షన్ ఏదో ఇచ్చారు

ఆ రాత్రి గడిస్తేనేకానీ చెప్పటం కష్టమన్నారు. చేయవలసిందంతా చేస్తున్నారు.

మురళీకృష్ణ మనసులో పెనుతుఫానులు వీస్తున్నాయి. "నీరజ బ్రతికితే అంతే చాలు.... ఆమెను తప్పకుండా శేఖర్ దగ్గరకు పంపించేస్తాను.... ఎక్కడున్నా - ఆమె సుఖంగా వుండటమే నాకు కావాల్సింది ... నీరజను బ్రతికించు భగవాన్!.... నిన్నేమీ ఇంక ఈ జీవితంలో కోరుకోను!—తల చేతుల్లో పెట్టుకొని - దాదాపు ఏడ్చేశాడు మురళీకృష్ణ.

అతనికి ధైర్యం చెప్పారు డాక్టర్లు ... ఆమె అరికాళ్ళు రాస్తూ కాళ్ళవద్ద కూర్చుంది రంగమ్మ కన్నీటితో.... కాసేపటికి సంధి మాటలు మాట్లాడటం మానేసింది.... అంతా నిశ్శబ్దం ఆవరించింది. చాలా సేపు మౌనంగా అందరివైపూ చూసింది నీరజ.

డాక్టర్లు తృప్తిగా ఒకరినొకరు చూసుకున్నారు.... కనుపించని దైవానికి - మనసులోనే నమస్కరించాడు మురళీకృష్ణ.

నీరజ బ్రతికి బయటపడింది మరోసారి....

బాగా కోలుకునేటప్పటికి - మరో పదిహేను రోజులు గడిచిపోయాయి. ప్రతి క్షణం ఆమెకు శేఖరం జ్ఞాపకానికి వస్తూనే వున్నాడు. గడువు పూర్తవుతున్న సమయానికే ఇంత జ్వరం రావాలా ? తాను ఇంక ఎప్పటికి పూర్తిగా కోలుకోగలుగుతుంది ! ఎప్పుడు వెళ్ళిపోగలుగుతుంది ? ... ఇదే తపన ఆమెకు....

నీరజకు పత్యం పెట్టిన రోజునే - మురళీకృష్ణ ఆఫీసుకు బయల్దేరాడు.... ఆమెకు సుస్తీ చేసినప్పటినుంచీ అతను శలవు లోనే వున్నాడు. ఆఫీసుకు వెళ్ళేముందు రంగమ్మను పిలిచి—

"నేను ఆఫీసుకు వెడుతున్నాను. తొందరగానే వచ్చేస్తాను. నీరజను జాగ్రత్తగా చూస్తూండు"— అన్నాడు.

ఆ మాటలు నీరజకు కూడా వినిపించాయి. తనపట్ల అతనికి వుండే ఆదరణకూ, ఆప్యాయతకూ ఆమె మనసు ఆర్ద్రమైంది. అతను వెళ్ళిపోయాక నీరజ పక్కమీదనుంచి సగంలేచి రంగమ్మను పిలిచింది.

"ఉత్తరం రాయాలి! కాస్త లెటర్‌ప్యాడ్, పెన్నూ తెచ్చి పెడతవా రంగమ్మా ?"—

"అలాగేనమ్మా :"....

హాల్లోకివెళ్ళి మరుక్షణంలో, లెటర్‌ప్యాడ్, పెన్నూ తెచ్చి ఆమెకు ఇచ్చింది! ఉత్తరం రాయటానికి వీలుగా కూర్చోవటానికి- నీరజ వెనకాల తలగడలు వత్తుగా పెట్టింది.... బత్తాయిరసం తీసుకరావటానికి వంటింటిలోకి వెళ్ళిపోయింది రంగమ్మ....

శేఖరానికి వుత్తరం రాయాలని నీరజ తపన.... ఇంతకాలం తనకు ఎంతసుస్తీచేసిందో, మృత్యువుతో ఎలాపోరాడిందో, అతనికి తెలియచేయాలని ఆమె మనసు ఆరాటపడుతోంది.... శరీరంలో శక్తిలేకపోయినా, ఓపికతెచ్చుకొని - ఎలాగోసమాళ్ళుంచి లెటర్ ప్యాడ్ అట్ట వెనక్కితిప్పింది.

లేత నీలంరంగు కాగితంమీద- సగంరాసిన ఉత్తరమేదో ఆమెకు కనిపించింది ... ఇతరుల వుత్తరాలు చదవటం సభ్యత కాదని తెలిసినా- ఎందుకో- అప్రయత్నంగానే చదవసాగింది.... ఆ వుత్తరాన్ని మురళీకృష్ణ రాజారామ్‌కు రాస్తూ- ఎందుకనో సగం లోనే ఆపేశాడు.

"రాజా....

నీ వుత్తరం అందింది.... కానీ నీకు జవాబు ఏంవ్రాయాలో అర్థంకాక, ఆలస్యంచేశాను.... ఏమీ అనుకోకు.... నువ్ రాసిన

విషయాలు తల్చుకుంటూంటే- ఇప్పటికీ నవ్వాలో, ఏడ్వాలో అర్థం కావటంలేదు ... 'నీరజా నేనూ కలసి ఏవేవో సుందర లోకాల్లో విహరిస్తూ నిన్ను మరచిపోయివుంటాననీ, అదే నువ్ కోరుకుంటు న్నావనీ'రాశావ్.... నాఅదృష్టాన్ని పొగుడుతూ ఇంకాఏమిటేమిటో రాశేశావు.... కానీ రాజా! నా అదృష్టం మరొకరి దురదృష్టంగా మారటం నాకు ఇష్టంలేదు....

"....సుందరలోకాలంటూ వుంటాయని నాకు తెలియదు.... నాకు తెలిసిందల్లా ఒక్కటే!.... అది నీరజ సంతోషంగా వుండటం! అసలు ఈమధ్య నీరజకు చాలా సుస్తీ చేసింది.... అందరంఎంతో ఆందోళన చెందాం.... భగవంతుని దయవల్ల నీరజకు పునర్జన్మ కలిగింది.... కానీ నీరజ మానసికంగా అలసిపోయింది.... కాస్త శక్తిరాగానే,ఆమె కలలోసైతం ఆరాదిస్తున్న శేఖర్ దగ్గరకుపంపిం చేయాలను కుంటున్నాను.

"....నీరజ నా ఆరాధ్యదేవత!.... ఆవిషయం నీకూతెలుసు. అందుకే ఆమె ఆనందంకంటే నాకు కావలసింది మరొకటిలేదు.... ఆమె ఎక్కడున్నా సుఖంగావుంటే అంతేచాలు....

"....రాజా!.... కొన్నిజీవితాలు ఎలాంటి అనుభవాలకూ నోచుకోవు.... కాని, కొన్ని అనుభూతులు నీలిపరదాలమాటున క్షణం మెరిసి మాయమయ్యే జలతారు తీగల్లాంటిది.... ఒరేయ్‌రాజా అన్నీ పోగొట్టుకున్న నేను...."

ఆగిపోయింది అక్కడితో ఆ వుత్తరం —

ఆ ఉత్తరంలోవున్న అక్షరాలు - జీవితసత్యాలను నీరజకు చెబుతున్నట్టు అనిపించింది.... ఆమె హృదయంలో ఏదో అలజడి. తుఫాను ఘోషలావుంది.... ఆకాశమూ, భూమీ తలక్రిందులై గిర గిరా తిరిగిపోతున్నాయి.... వళ్ళంతా చెమటతో తడిసిపోయింది.... గుండె దడదడాకొట్టుకుంటోంది ... కళ్ళుమూతలుపడిపోతున్నాయి.

రంగమ్మ బత్తాయిరసం తీసుకొచ్చింది.... ఒక్కగుటకలో అదంతా త్రాగి కాస్త తెప్పరిల్లింది.

"రంగమ్మా! ఈ లెటర్‌ప్యాడ్ ఎక్కడనుంచి తెచ్చావో

జాగ్రత్తగా అక్కడే పెట్టేయ్.... డ్రాయరులో వెనకగా
ండ్ కవర్లుంటాయి.... ఒకటి తెచ్చిపెట్టు"- లెటర్ ప్యాడ్‌ను
రంగమ్మకు ఇచ్చేస్తూ అంది నీరజ.

వీపుక్రింద.... మరో ఎత్తైన తలగడా అసరాగా పెట్టుకొని, రంగమ్మ ఇచ్చిన ఇన్‌లాండుకవరులో-ఉత్తరం రాయటం మొదలు పెట్టింది నీరజ.

"చంద్రశేఖరంగారూ !

మీ ఉద్దేశ్యం ఏమిటో - ఇప్పటికి నాకు పూర్తిగా అర్థ యింది.... 'ఈ ఆరునెలలూ అయనవద్ద వుండి ఆ యింటిలో పురంచేసి ఆతర్వాత చట్టబద్ధంగా నాదగ్గరకు వచ్చేద్దువుగాని' ని అనాడు మీరురాస్తే - నిజమనుకున్నాను.... అసలుసంగతి ఇప్పుడర్థమయింది.

".... ఆరునెలలకాలంలో - ఈ జీవితంతో రాజీపడి-శాశ్వ ంగా మిమ్మల్ని వదులుకుంటానని మీరు ఉద్దేశ్యపడ్డారు.... మమ్మల్ని మరచిపోయి, ఆయన సేవలో కొత్తజీవితానికి అర్థం లుసుకుంటానని మీరు భావించారు.... ఏది ఏమైనా ఒక నగ్న త్యం ఇవాళ నాకళ్ళు తెరిపించింది.

ప్రేమించిన పురుషునిచుట్టూ స్త్రీ తిరగటంకంటే ప్రేమించిన రుషుడే స్త్రీచుట్టూ తిరగటంలో ఆస్త్రీకి సంతృప్తీ: నిశ్చింతా ంటాయని తెలుసుకున్నాను.

ఉంటాను.... శలవు. ఈక్షణంనుంచీ

ఎప్పటికీ మీకేమీకాని

నీరజ...."

సమాప్తం

---

అంకితం

ఈ నవల శ్రీ వెంకటేశ్వరుని చరణములకు అంకితం.

యగలిగి రాయకపోవడం - దురదృష్టం. నువ్వు బాగానే యగలవు. అంటూ ప్రోత్సహించిన శ్రీవారికి—

చాలాకాలంగా ఆగిపోయిన నా రచనా వ్యాసంగానికి తిరిగి ర్యం కలిగించిన సోదరి రాజ్యలక్ష్మికీ కృతజ్ఞతలు.

— రచయిత్రి



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M142 |
| పుస్తకం పేరు | స్వాతి ముత్యాలు |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CV, BCV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవది | Sowmya |
| పేజీలు విడదీసినవది | Sowmya |
| స్కాన్ చేసినవది | Y. Bhanu Sree |
| పరీక్ష చేసినవది | KASIMBI |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | |
| పరిస్థితి | good |